# స్వప్నబంధము

అను

# వక్షప్రదీపిక



గావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు
292, ఎస్ప్లనేడ్
చెన్నపురి:

# ఆంధ్ర గ్రంథములు.



## పద్య కావ్యములు.

ప్రతి 1

అప్పకవీయము, గిడుగు రామమూర్తిపంతుల విమర్శతో

ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) ...

ఆంధ్రభాగవతము, పద్యకావ్యము ...

„ ఉత్తమప్రతి, 2 సంపుటములు ...

ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ...

„ టీక ...

ఆంధ్రభారతము, పద్యకావ్యము:—

ఆది సభాపర్వములు గల సంపుటము ...

ఆరణ్యపర్వము ...

విరాటోద్యోగపర్వములు ...

భీష్మద్రోణపర్వములు ...

కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ...

శాంతిపర్వము ...

ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్వర్గారోహణపర్వములు ...

ఆదిపంచకము, ఒకటేసంపుటము ...

యుద్ధపంచకము, స్త్రీపర్వము ...

శాంతిసప్తకము ...

ఆనందరంగరాట్ఛందము ...

ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటు క్యాలికోబైండు ...

ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము ...

ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ...

కవికర్ణరసాయనము, (మాంధాతృచరిత్ర) ...

కాశీఖండము, శ్రీనాథకవి ...

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు | ... | 10 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు | | అచ్చు | |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 1 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము | ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, పద్యము కేతనకవి | ... | 2 | 0 |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు | ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది | ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 2 | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము | | 2 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము | | 1 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 1 | 0 |
| ,, క్యాలికోబైండు | ... | 1 | 8 |
| ,, వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| ,, క్యాలికోబైండు | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి | | 2 | 0 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి | ... | 3 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము | ... | 6 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 3 | 0 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు | ... | 3 | 0 |
| ,, II ,, | ... | 3 | 0 |
| ,, III ,, | ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 5 | 0 |

| | | |
|---|---|---|
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము ... | 3 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక ... | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము ... | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము ... | 7 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది ... | 1 | 8 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము ... | 3 | 8 |
| వివేకసింధు, కొండనార్యప్రణీతము ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ ... | 2 | 0 |
| వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము ... | 1 | 4 |
| వీరభద్రవిజయము, పోతనకృతము ... | 2 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 1 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము ... | 1 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... | 2 | 0 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి ... | 1 | 8 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతికృతము ... | 1 | 8 |
| సమీరకుమారవిజయము, నూతనముద్రితము ... | 1 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము ... | 1 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, తాత్పర్యము ... | 5 | 8 |
| ,, అట్టబైండు ... | 3 | 8 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయకవి (క్రొత్తకూర్పు) | 1 | 0 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రగడ ... | 6 | 0 |
| హరవిలాసము, శ్రీనాథకవి ... | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి ... | 1 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

# పుష్పబంధమను వర్షాది ప్రదర్శని.

## కార్తికమాసధాతువులు.

శ్లో. పుష్పబంధం ప్రవక్ష్యామి గిరిరాజసుతే శృణు,
కార్తిక్యాం పూర్ణిమాయాంతు కృత్తికాయుక్త పూర్ణతా. ౧

శ్లో. పుష్పబంధం సమాదిష్టం మాసాచత్వారి వర్షతి,
సుభిక్షం క్షేమమారోగ్య సస్యనిష్పత్తిరేవచ ౨

తా॥ ఓపార్వతీదేవి వినుమా - కార్తిక శుద్ధ పూర్ణిమనాడు కృత్తికపూర్ణయుగమం
కిన నది పుష్పబంధమనబడును అటుల గలిగిన వర్షాకాలమునందు నాలుగుమాసములు
ర్షించి సుభిక్ష క్షేమారోగ్యములుగలిగి సస్యములు పూర్ణముగ ఫలించును.

శ్లో. ఆర్ద్రాయాంచగతేసూర్యే ఘటికామనుసంఖ్యయా,
వర్షంతి మేఘబృందాని తస్మాద్గర్భం నిరీక్ష్యతే 3

తా॥ సూర్యప్రవేశకాలమగు పూర్వాషాఢ మొదలుం పదునాలుగుగడియలలో వర్ష
నాతువులు గానంబడిన ఆర్ద్ర మొదలు వర్షించును.

శ్లో. అథవాతద్దినే దేవి ద్వయోర్ఋంజాయతే యది,
అతిదాహమనావృష్టిః ఖండఖండం ప్రవర్షతి ౪

తా॥ కార్తికశుద్ధపూర్ణిమనాడు భరణి, కృత్తిక యీరెండునక్షత్రములు గూడి
యుండెనేని విశేషముగ, ఎండ, అనావృష్టి, ఖండవర్షము ఇవిగలుగును

శ్లో. రోగాగాచ్ఛాశ్వివిధాతృభ్యా ముత్పాతావివిధామతాః,
రాజ్ఞాంన్యాణాంచ దేవేశి యుద్ధంస్యాచ్చ పరస్పరమ్. ౫

తా॥ కార్తికశుద్ధపూర్ణిమనాడు అశ్విని రోహిణినక్షత్రములుండినదేశమునందు నానా
విధయుత్పాతములును, రాజులు మనుజులు మొదలగువారికి పరస్పరకలహములునుగలుగును.

శ్లో. తథాశ్వినీచ వే దేవి తద్దినేవర్తతేయది,
సింహాళ్యోర్మధ్యకాలేచ మేఘావర్షంతిమధ్యమమ్. ౬

తా॥ కార్తికశుద్ధపూర్ణిమనాడు అశ్విని నక్షత్రముండిన సింహసంక్రమణము మొ
దలు వృశ్చికపర్యంతము మధ్యవృష్టి గలుగును.

శ్లో. అథవారోహిణీయుక్తం తద్దినేవర్తతేయదా,
చతుష్పాదాద్విపాదాశ్చ యాంతివిహ్వలతాం ధ్రువమ్ ౭

తా॥ కార్తికశుద్ధపూర్ణిమనాడు రోహిణీనక్షత్రముండిన మానుష పశ్వాదులకు
భీతివాటిల్లును

శ్లో. చతుర్థావిభ జేన్మృత్యుం త్రిచతుష్పాదసంఖ్యయా,
ఆద్యేత్వర్ధేశివే దేవి పాదంవార్ధం చ దృశ్యతే ౮

తా. కార్తికశుద్ధపూర్ణిమనాడు కృత్తికాదినక్షత్రము లొకపాదము లేక రెండు పాదములుండిన స్వల్పవర్షము అర్ధఫలము గలుగును

శ్లో. షష్ఠిర్ఘటింస్థితఃఋక్షం తిధి రేకా తథా భవేత్.
తేనమాసేన దేవేశి పుష్పసంజ్ఞాప్రకీర్తితా ౯

తా. పైపూర్ణిమనాడు తిథినక్షత్రములు సంపూర్ణముగనుండిన కర్కాటకాది తులాంతమువరకు చక్కగ వర్షించును గాన దానికి పుష్పమను సంజ్ఞగలదు.

మేఘగర్భలక్షణము.

శ్లో. ధనూరాశిగతేసూర్యే మూలాద్యాగర్భధారిణః,
గర్భాద్యాశ్చధ్రువంవృష్టిః పంచోత్తర శతానిచ. ౧౦
దినసంఖ్యావరారోహే వర్షతేనాత్రసంశయః,

తా. సూర్యుడు ధనస్సులో ప్రవేశించినదిమొదలు మూలకార్తెయందు దశధాతువులు గానంబడిన నదిమొదలు ౧౦౫ దినములవరకు వర్షించును, పూర్వాషాఢయందు సూర్యుడు ప్రవేశించునపుడు వర్షధాతువులు గానంబడిన పునర్వసు కార్తె వర్షించును. ఇటుల మూలాదిపదునాలుగు కార్తెలుతీర్చిన నార్ద్రాదిపదునాలుగుకార్తెలు వర్షించును

శ్లో మేషరాశిగతేభానౌ చన్ద్రేదస్రర్క్షమాశ్రితే ౧౧
తదాప్రవర్షతే దేవి మూలాగర్భంవినశ్యతి,

తా మేషరాశియందు సూర్యుడును అశ్వనియందు చంద్రుడును ఉండగ వర్షించెనేని మూలగర్భముచెడి ఆర్ద్రకార్తెలో వర్షించదు

శ్లో. రోహిణ్యాంవర్షతే దేవి ఉత్తరాషాఢనశ్యతి ౧౨

తా రోహిణియందు చంద్రుడుండునపుడు వర్షించిన నుత్తరాషాఢలో వర్షించదు.

శ్లో రోహిణ్యాంవర్షతే దేవి శ్రావణేగర్భనాశనమ్,
మృగేప్రవర్షతే దేవి ధనిష్టాచవినశ్యతి. ౧౩

తా, రోహిణియందు చంద్రుడుండగ వర్షించిన శ్రావణగర్భము నశించును మృగశిరయందుండగ వర్షించిన ధనిష్టాగర్భము నశించును.

శ్లో ఆర్ద్రాయాంవర్షతే దేవి శతతారావినశ్యతి,
అదిత్యాంవర్షతే దేవి రేవత్యాంచవినశ్యతి. ౧౪

తా ఆర్ద్రయందు చంద్రుడుండగ వర్షించిన శతభిషగర్భముచెడి పుబ్బలోవర్షించదు పుబ్బయందు చంద్రుడుండగ వర్షించిన రేవతిగర్భముచెడి ఉత్తరయందువర్షించదు

శ్లో పుష్యేప్రవర్షతే దేవి అశ్వన్యాం చైవనశ్యతి,

పంచమీపంచనుస్థానే గర్భంభవతినాన్యథా. ౧౫

తా॥ పుష్యమియందు చంద్రుడుండగ వర్షించిన స్వాతిగర్భముచెడి హస్తయం దువర్షించదు వర్షించిన నక్షత్రమున కైదవనక్షత్రమునందు సూర్యుడుప్రవేశించిన గర్భ స్రావమగును అదివరపుగల నక్షత్రము

శ్లో॥ ఆశ్లేషాయాంవర్షతిచేత్ భరణీచవినశ్యతి,
మఘాయాంవర్షతే దేవి కార్తిక్యాంచ వినశ్యతి ౧౬

తా॥ ఆశ్లేషయందు చంద్రుడుండగవర్షించిన భరణిగర్భముచెడి కార్తికమునందువర్షిం చదు మఘయందు చంద్రుడుండగవర్షించిన కృత్తికగర్భముచెడి స్వాతియందువర్షించదు

శ్లో॥ ప్రభాప్రవర్షతే దేవి విశాఖాచ వినశ్యతి,
ఏవంవిచారమనసా వదేత్కాలం సతాంముదే ౧౭

తా॥ పుబ్బయందు చంద్రుడుండగ వర్షించిన రోహిణిగర్భముచెడి విశాఖయందు వర్షించదు ఇటుల కాలమును విచారించి వర్షపరిమాణమును దెలిసికొనవలయును

శ్లో॥ జేష్ఠమాసేసితేపక్షే ఆర్ద్రాదిదశఋక్షకే,
సజలానిర్జలాఘామేఘూ నిర్జలానజలాస్మృతాః. ౧౮

తా॥ జేష్ఠశుద్ధమందు ఆర్ద్రమొదలు పదినక్షత్రములలో వర్షించిన పదికార్తెలు వర్షించవు ఆర్ద్రప్రవేశకాలంబున వర్షించకపోయిన పైపదికార్తెలు వర్షించును

శ్లో॥ ఆర్ద్రాయాంవర్షతే దేవి గర్జితేవాకథంచన,
సర్వేగర్భాఃప్రణశ్యంతి ప్రావృడ్వృష్టిస్తుమధ్యమా ౧౯

తా॥ ఆర్ద్రప్రవేశసమయంబున వర్షించినను లేక గర్జించినను గర్భములుచెడి వర్ష కాలమునందు స్వల్పవృష్టియగును

మార్గశీర్షమాసధాతువులు.

శ్లో॥ మార్గశీర్షేశుక్లపక్షే ప్రతిపత్పూర్ణిమాంతకమ్,
ధాతవస్సంచరంత్యేతే జేష్ఠకృష్ణేప్రవర్షతి. ౨౦

తా॥ మార్గశిరశుద్ధపాడ్యమి మొదలు పూర్ణిమలోపల దశధాతువులు* గానంబడిన జేష్ఠమాస కృష్ణపక్షమందు వర్షించును

శ్లో॥ మాసస్యమార్గశీర్షస్య నక్షత్రేపితృదైవతే,
భూతేవిద్యుద్దర్శితేవా శుచిమాసేప్రవర్షణమ్ ౨౧

తా॥ మార్గశీర్షమాసము చతుర్దశియందు మఘానక్షత్రముగనుండి మెఱుపుగానం బడిన నాషాఢమాసమునందు వర్షించును

---

* మేఘు, మెఱుపు, ఉరుము, నీరుకాల్వ, శీతము, ఉష్ణము, గాలి, వర్షము, పరివే షము, ధనుస్సు ఇవియు దశధాతువులు

శ్లో. చతుర్థ్యాంజలయోగేతు మేఘబృందైశ్చసంకులే,
రాత్రౌదృష్ట్వాదినేవృష్టి ర్దినేదృష్ట్వానిశానుచ ౨౨

తా మార్గశిరశుద్ధచవితియందు వర్షించిన వర్షాకాలములో దివారాత్రులు వర్షించును రాత్రికాలంబున దశధాతువులు గానంబడిన పగలు వర్షించును పగలు దశధాతువులు గానంబడిన రాత్రికాలంబున వర్షించును

శ్లో పౌర్ణమాస్యాంయదివ్యోమ్న చంద్రమాచతురిష్యతి,
దక్షిణాచోత్తరావిద్యు దుత్పాతోవాభవిష్యతి ౨౩

తా మార్గశిరశుద్ధపూర్ణిమనాడు వర్షించకనే ఆకసమున మలినములేక చంద్రుడు ప్రకాశింపుచుండగ దక్షిణోత్తరములలో మెఱుపుగానంబడిన వర్షాకాలమునందు దుర్భిక్షము, ఉత్పాతములు గలుగును

## పుష్యమాసధాతువులు

శ్లో పౌషేశుక్లేతురోహిణ్యాం పౌర్ణమాసేషు ధాతవః,
దృశ్యంతేకర్కటేమాసే వృష్టిర్భవతినాన్యథా ౨౪

తా పుష్యశుక్లపూర్ణిమ రోహిణీనక్షత్రము గూడినదినంబున దశధాతువులు గానంబడిన కర్కాటకమునందువర్షించును పైధాతువులు గానంబడకయున్నేని వర్షముగలుగగు

శ్లో. పౌషేమాసేపంచదశ్యాం రాత్రౌయామచతుష్టయే,
హిమాదిధాతుదృశ్యేత వృష్టిర్మాసచతుష్టయే ౨౫

తా పుష్యశుద్ధపూర్ణిమనాటిరాత్రి నాలుగుఝాములయందు మంచుతోగూడ దశధాతువులుగానంబడిన వర్షాకాలము నాలుగు మాసములయందు వర్షించును

శ్లో పూర్ణిమాద్యాసప్తతిథ్యాం దృశ్యంతే దశధాతవః,
వృష్టిర్మాసచతుష్కేన బహువర్షంతితత్రతు. ౨౬

తా పుష్యశుద్ధపూర్ణిమ మొదలేడుదినములయందు దశధాతువులు గానంబడిన వర్షాకాలము నాలుగుమాసములయందు విశేషముగ వర్షించును

శ్లో పౌషేమాసేపూర్ణిమాయాంతు రాత్రౌయామైకైకంశోధయిత్వాహిమంచ, సంధ్యాకాలంచాదితత్కాలమాసే వర్షంచాస్తేసర్వదావాహుర్మునీంద్రాః ౨౭

తా పుష్యశుద్ధపూర్ణిమరాత్రి నాలుగుఝాములు మంచునుపట్టి శోధించిన వర్షాకాలములో నాలుగుఝాములు వర్షపరిమాణము విదితంబగును

శ్లో. కార్పాసపలమేకంచ ఘటమృత్పాత్రమధ్యమే,
స్థితేదూర్ధ్వగతేసాయం సంధ్యాదాప్రతియామకమ్. ౨౮

శ్లో॥ యామాంతేపీడయే త్త్రత కార్పాసప్రవణోదకమ్,
కాలే ప్రవర్ష తే దేవి బిందవో మధ్యవృష్టికృత్ ౨౯
బిందుహీనే భవే త్త్రత వృష్టినాశకరం భవేత్

తా॥ పుష్యశుద్ధపూర్ణిమ సాయంకాలమున కుమ్మరిమన్నుచే మూకుడుజేసి యొక పలముదూదిని నాలుగుభాగములుగ విభజించి యొక్కొ-కభాగము నొక్కొ-కయామము లో పైమూకుడులోనుంచి బైలుగానుండెడి యున్నతస్థలంబునందుబెట్టి యామాంతము నందాపత్తిని పిడిచిన నేయామములో హిమాంబువులు ధారగబడునో నాశ్రావణాది వర్షా కాలములోని ఆయామాసములో వర్షించునని యు, ఏయామములో దూదినుండి బిందువులు గ హిమాంబువులుబడిన నట్టిమాసంబున మధ్యవృష్టిగనుండునని యు ఏయామములో బిం దువులుగా గానంబడక పోయిన నామాసంబున వర్ష మేలేదని యు తెలిసికొనవలయును.

శ్లో॥ పౌషేతుకృష్ణపక్షేతు మూలాద్యాదర్శమధ్యమే,
అస్తిచేత్పూర్వవాయుశ్చ వృష్టిర్మాసచతుష్టయే ౩౦

తా॥ పుష్యమాసకృష్ణపక్ష మూలానక్షత్రము మొదలు అమావాస్యలోపల గాలి వీచుచుండిన వర్షాకాలమునందు నాలుగుమాసములు వర్షించును

## మాఘమాసధాతువులు

శ్లో॥ మాఘే ప్రతిపదాష్టమ్యాం ద్వాదశీపర్వసంధిషు,
హైమంచమారుతశ్చాస్తి జేష్ఠమాసేసువృష్టికృత్ ౩౧

తా॥ మాఘశుద్ధపాడ్యమి, అష్టమి, ద్వాదశి, పర్వసంధులయందు మంచుగాలి కొట్టిన జేష్ఠమాసములో విశేషముగ వర్షించును

శ్లో॥ మాఘేవిశాఖాజలర్క్ష వాయుభే శతర్క్ష మూలాది చతుర్షుచ స్యాత్, సదాగతిర్వా హిమసంహతిర్వా భవేన్నభస్యశ్చ సువృష్టికృత్సదా. ౩౨

తా॥ మాఘమాసములో విశాఖా, ఆశ్లేషా, పూర్వాషాఢా, స్వాతి, శతభిషము, మూల యీనక్షత్రములయందు విశేషముగ మంచుగాని గాలిగాని గలిగిన భాద్రపదమా సమునందు వర్షించును.

శ్లో॥. మాఘేతుపౌర్ణమాసేచ మఘాయాంవృష్టికృద్యదా,
తదాద్యబ్ధిపురో దేశే సుభిక్షమతివృష్టికృత్ ౩౩

తా॥ మాఘశుద్ధపూర్ణిమ దివసంబున మఘానక్షత్రము గూడియుండగ వర్షించిన ముందురాబొయ్యెడిసంవత్సరంబున సముద్రతీరప్రదేశములయందు సుభిక్షము సువృష్టి గలిగియుండును

శ్లో॥ మాఘమాసేశుక్లపక్షే సప్తమ్యాంపరిధిర్విధోః,
శ్రావణేకృష్ణసప్తమ్యాం వృష్టిస్తత్రనసంశయః. ౩౪

తా॥ మాఘశుద్ధ సప్తమీదివసంబున చంద్రపరివేషము గానంబడిన రాబోయ్యేడి శ్రావణబహుళ సప్తమీదివసంబున వర్షించును

## ఫాల్గుణమాసధాతువులు

శ్లో॥ ఫాల్గునేకృత్తికాద్యాశ్చ మూలాంతేదశధాతవః,
పూర్వాష్వయేమారుతశ్చ దృశ్యతే గర్భధారణమ్ ౩౫

తా॥ ఫాల్గుణమాసమందు కృత్తికాది మూలాంతమధ్యములో పుబ్బ, పూర్వాషాఢ, స్వాతి, మఖలయందు దశధాతువులు గానంబడిన నామాసము గర్భమునుధరించును

శ్లో॥. ఫాల్గునేశుక్లపక్షేతు రోహిణ్యాం చంద్రసంయుతే,
పరివేషేతథాప్రాపే వృష్టిర్వాకలహాంభవేత్ ౩౬

తా॥ ఫాల్గుణశుద్ధమందలి రోహిణీనక్షత్రమందు చంద్రపరివేషము గానంబడిన వర్షించును లేక కలహములైనా సంభవించును

శ్లో॥. ఫాల్గునేమాసిసంప్రాప్తే వృష్టిక్రుద్వాయుసంయుతే,
భానుచిత్రాగమేకాలే వృష్టిస్సస్యాభివృద్ధయే ౩౭

తా॥. ఫాల్గుణమాసములో గాలితోగూడి చిత్తయందువర్షించిన సస్యాభివృద్ధిగలుగును.

## చైత్రమాసధాతువులు

శ్లో॥. చైత్రమాసేశుక్లపక్షే చేకాదశ్యాదివాదివా,
తిథయశ్చతురోవృష్టిః ప్రావృట్కాలేనవర్షణమ్ ౩౮

తా॥ చైత్రశుక్ల ఏకాదశిమొదలు నాలుగుదినములు వర్షించిన వర్షాకాలమునందు వృష్టిలేకపోవును

శ్లో॥ ద్వాదశ్యాంవాచతుర్దశ్యాం చైత్ర్యేంద్రధనురీక్ష్యతే,
అపరాహ్ణేసువృష్టిస్యాత్ రాత్రౌదుర్భిక్షముచ్యతే. ౩౯

తా॥ చైత్రమాసద్వాదశి చతుర్దశి యీతిథులయందు మధ్యాహ్నమునకు పైన నింద్రధనుస్సు గానంబడిన వృష్టిగలుగును రాత్రిగానంబడిన దుర్భిక్షము గలుగును.

## వైశాఖమాసధాతువులు

శ్లో॥ రాధాశుక్లతృతీయాయాం పశ్చిమే మేఘదర్శనమ్,
గర్జితంజాయతేయత్ర తత్రభూమౌ సువృష్టికృత్. ౪౦

తా॥ వైశాఖశుద్ధతదియ దివసంబున పశ్చిమమున మేఘమువ్యాపించి గర్జించిన నా గర్జితశబ్దమెంతవరకు వినబడునో అంతవరకు మంచివృష్టిగలుగును

శ్లో॥ వైశాఖేపౌర్ణమాసేతు ప్రాగబ్దోవర్షతేయది,
తద్భూమౌఫలితంచైవా వృష్టిసస్యాభివృద్ధయే. ౪౧

తా॥ వైశాఖశుద్ధపూర్ణిమ దివసంబున తూర్పున మేఘముప్రబలి వర్షించిన నాప్రదేశమునందు విశేషముగ వర్షించి సస్యములు ఫలించును.

శ్లో॥ రాధాశుక్ల ప్రతిపదా దినేషుచ చతుర్ష్వపి,
వృష్టిర్వాతగర్జితంచాస్తి ప్రావృష్యక్షతేసర్వదా ౪౨

తా॥ వైశాఖశుద్ధ పాడ్యమి మొదలు నాలుగుదినములలో వర్షము, ఉరుము, గాలి ఇవి గానంబడిన వర్షాకాలమునందు చక్కగ వర్షించును

శ్లో॥ కేవలంమేఘబృందంతు దృశ్యతేవృష్టినాశనమ్,
వర్షేణసహితేమేఘే వర్షాకాలేనువృష్టికృత్ ౪౩

తా॥ పైదినములయందు మేఘములువ్యాపించి వర్షించకనె వర్షాకాలమునందు వృష్టిలేక పోవును వర్షసహితముగ నాకసమునందు మేఘములు పరివిన విశేషవర్షము సస్యాభివృద్ధి ఇవి గలుగును

శ్లో. వైశాఖేకృష్ణపంచమ్యాం ప్రాగుదఙ్ముఖసంకులమ్,
ప్రావృణ్మాసచతుష్కేతు వృష్టికృత్సస్యవృద్ధికృత్. ౪౪

తా॥ వైశాఖబహుళపంచమి దివసంబున తూర్పు ఉత్తరములలో మేఘములు వ్యాపించి వర్షాకాలమునందు వర్షించిన సస్యాభివృద్ధియగును.

శ్లో॥ తద్దినేవిద్యుద్దర్శేన మధ్యసస్యాల్పవృష్టిదః,
తస్మాత్సర్వప్రయత్నేన వృష్టిమేఘాంశ్చశోధయేత్ ౪౫

తా॥ వైశాఖ బ ౫ దివసంబున మెఱుపు గానంబడిన మధ్యసస్యములు స్వల్పవృష్టి గలుగును కావున నాదినంబున మేఘములను చక్కగ పరీక్షింపవలయును

శ్లో॥ వైశాఖేర్కేందురోహిణ్యాం సంయుతాయదివేత్తదా,
పూర్ణవృష్టిశ్చసతతం ప్రావృట్కాలేనసంశయః. ౪౬

తా॥ వైశాఖమాసములో రోహిణీనక్షత్రమునందు రవిచంద్రులేక రాశియందున్నపుడు వర్షించెనేని వర్షాకాలములో సంపూర్ణవృష్టిగలుగును

శ్లో. వృషేచాద్యనవాంశేతు చంద్రార్కౌయదిసంగతౌ,
సింహేందుగురుసంస్థేవా తదావృష్టించకారయేత్ ౪౭
తదాప్రభృతివర్షాంతే బహువృష్టికరోభవేత్,

తా॥ వృషభములో ప్రథమనవాంశయందు చంద్రసూర్యులు గూడియుండునపుడును సింహమందు గురుచంద్రులు గూడియుండునపుడును వర్షించిన నదిమొదలు వర్షాకాలాంతమువరకు విశేషముగ వర్షింపుచుండును

శ్లో॥ వైశాఖేకుహూమధ్యాహ్నే త్వపరాహ్ణేంభ్రసంచయః ౪౮
వర్షాకాలేనువృష్టిస్స్యాత్ సస్యాదిత్రితయప్యతి,

తా॥ వైశాఖ బహుళ అమావాస్య దివసంబున మధ్యాహ్నపరాహ్ణములయందు మేఘములు వ్యాపించిన వర్షాకాలమునందు వర్షించి మూడుభాగములు ఫలించును

శ్లో. వృషేదినకరస్థేతు పార్శ్వయోశ్శశిభూమిజౌ. ౪౯

కుజజ్ఞాహరిసంయుక్తౌ భవతశ్చ్యుతదాభవేత్,
తస్మిన్ మధ్యేమధ్యవృష్టిః కరోతివసుధాతలే ౫౦

తా॥ వృషభములో సూర్యుడుండునపుడు చంద్రాంగారకులు గాని కుజబుధులు గాని యుభయపార్శ్వములం దుండిరేని నాసంవత్సరంబున మధ్యవృష్టిగలుగును

శ్లో॥ మృగార్ద్రాదితిసంస్థేర్కే విధౌతత్రతపడర్క్షగే,
తదావర్షంతిజీమూతాః సర్వంసస్య సమృద్ధిదాః ౫౧

తా॥ మృగశీర్షార్ద్రా పునర్వసులయందు సూర్యుడుండునపుడు సూర్యుని కాఱవ నక్షత్రమున చంద్రుడుండగ వర్షించిన నాసంవత్సరము సమృద్ధిగా వర్షించును

శ్లో॥ ఏవమార్ద్రత్రయర్క్షేషు తన్నవర్క్షేతుసంస్థితః,
వృష్టికృజ్జలనాశస్యా ద్బ్రహ్మాత్రాపిఖేచరాః ౫౨

తా॥ మృగశీర్షార్ద్రా పునర్వసులయందు సూర్యుడుండి యాసూర్యునికి తొమ్మిదవనక్షత్రమందు వర్షించిన నాసంవత్సరము వృష్టిలేకపోవును

జ్యేష్ఠమాసధాతువులు.

శ్లో॥ జేష్ఠేనైఋతివాయూశ్చ పశ్చిమేంద్రధనుర్యది,
తస్మిన్నబ్దేత్వనావృష్టి ర్మాసద్వయమథాపివా ౫౩

తా॥ జ్యేష్ఠమాసమునందు నైఋతినుండి గాలి, పశ్చిమమున నింద్రధనుస్సు, ఇవిగానంబడిన సంవత్సరాంతమువరకుగాని లేక రెండుమాసములవరకుగాని వృష్టిగలుగదు

శ్లో॥ మఘాదిపంచతారాసు మధ్యేసంధాచతుష్టయమ్,
ఉదగ్వీథిసమాశ్రిత్య జయపుష్కరకంజలమ్ ౫౪
రజోనామానిచత్వారి హిమాంశుశ్చ సువృష్టిదః,
జేష్ఠశుక్లేతుసప్తమ్యాం మఘామార్గత్రయేవిధుః. ౫౫
సంపూర్ణవృష్టిస్తస్యాబ్దే రజోమార్గేచరత్యపి,
తస్మిన్నబ్దేవృష్టినాశం గార్గస్యవచనంతథా ౫౬

తా॥ మఘాదిరైదు నక్షత్రములకు మధ్యయుత్తరపు దిశనాశ్రయించి జయము, పుష్కరము, జలము, రజము అనునాలుగు వీథులుగలవు వాటిలో రజముతప్ప తక్కిన మూడువీథులయందు దేనిలోనైన మాఘశు ౭ దివసంబున చంద్రుడు సంచరించిన నాసంవత్సరంబున సంపూర్ణముగ వర్షించును రజోవీథిని చంద్రుడు సంచరించిన వర్షించదు

శ్లో॥ త్వష్టృమిత్రేందుఋక్షేషు దక్షిణాయనగేరవౌ,
ఏవంజాతేజ్యేష్ఠమాసే వినాశంచశుచిత్రయే ౫౭

తా॥ జేష్ఠమాసంబున చిత్త, అనూరాధ జేష్ఠానక్షత్రములకు దక్షిణంబున సూర్యుడుసంచరించిన నాలుమాసములు వర్షించదు.

శ్లో. జ్యేష్ఠమాసే శుక్లపక్షే త్వషాఢాద్వయసంయుతే,
అథవా రోహిణీయుక్తే వృష్టినాశకరో భవేత్ ౧౮

తా. జ్యేష్ఠశుక్లమందు పూర్వాషాఢ ఉత్తరాషాఢ లేక రోహిణి నక్షత్రములలో దేనియందైన సూర్యుడు సంచరించిన వర్షించదు.

శ్లో. జ్యేష్ఠశుక్లాష్టమీవృష్టి గర్జితం జాయతే యది,
తావత్సమంతాద్వృష్టిస్స్యాత్ సస్యవృద్ధిః ప్రజాయతే ౧౯

తా. జ్యేష్ఠశుక్లాష్టమి దివసంబున వర్షించి గర్జించిన ఆ గర్జితము ఎంత భూమి వరకు వినబడునో ఆ ప్రదేశంబున వర్షించి సస్యములు వృద్ధియగును

శ్లో. చిత్రాదిత్రిషు ఋక్షేషు జ్యేష్ఠమాసే సితేంబరమ్,
నిర్మేఘమండలం తత్ర వృష్టిః శ్రావణమాసగే ౨౦

తా. జ్యేష్ఠశుక్లములో చిత్త స్వాతి విశాఖలయందు ఆకాశము మేఘరహితంబుగ నుండిన శ్రావణమాసములో వర్షించును

శ్లో. జ్యేష్ఠమాసే శుక్లపక్షే ద్వాదశ్యాదిచతుర్ష్వపి,
తిథిషు త్వంబరే శూన్యం మేఘాత్తోయం పతంతి చేత్. ౨౧
సాయాహ్నే ప్రాగుదక్తోయదాక్రాంతే వాయుసంయుతే,
తిథయశ్చతురో మాసా శ్రావణాదిచతుష్టయమ్. ౨౨
క్రమాద్వర్షతి సస్యాభివృద్ధయశ్చార్ఘవృద్ధయః,
చత్వారస్తిథయో వృష్టి వినాశే వృష్టినాశనమ్. ౨౩

తా. జ్యేష్ఠశుక్లద్వాదశి మొదలు నాలుగుతిథులయందు ఆకాశము నిర్మలముగనుండగ మేఘమండలమునుండి జలబిందువులు భూపతనమైనను లేక పైతిథులయందు సాయంకాలంబున తూర్పు ఉత్తరదిశలలో గాలితోగూడ మేఘములువ్యాపించినను శ్రావణాది నాలుగుమాసములయందు విశేషముగవర్షించి సస్యాభివృద్ధి అర్ఘవృద్ధిగలుగును పైతిథులయందు జలబిందువులు భూపతనముగాకపోయినను తూర్పు ఉత్తరపుదిశలలో గాలితోగూడ మేఘములులేకపోయినను పై ర మాసములయందు వర్షించక గర్భితములగును

## ద్రోణవర్ష ప్రమాణము

శ్లో. ముఖంతు త్ర్యంగుళం వృత్తం గర్భంతు చతురాఙ్గకమ్,
పూరయేద్వర్షబిందూభిః ద్రోణవృష్టిస్స ఉచ్యతే ౨౪

తా. గుండ్రముగ మూడంగుళములనోరు వెడల్పుగల నాలుగుతూములు పట్టెడియొక బానను వర్షించేకాలమునందు వర్షములోనుంచిన నది పూర్ణముగనిండెనేని యొక ద్రోణవర్షమని లెక్కింపబడును

## పంచాది ద్రోణవర్ష నిదానము

శ్లో. జ్యేష్ఠమాసే కృష్ణపక్షే చాశ్విన్యాద్యృక్షపంచకే,

వృష్టిస్నాన్యత్పంచకద్రోణం తదబ్దేవర్షనిశ్చయమ్. ౬౫

తా. జ్యేష్ఠబహుళపంచమినిమొదలైన నక్షత్రములయందు వర్షించిన నాకం వత్సరములో ఐదుద్రోణములు వర్షించును

శ్లో. ఆషాఢాదిత్రిబుక్షేషు పూర్వాభాద్రా తథైవచ,
వృష్టిస్యాద్ద్రోణసంఖ్యాసు సప్తసంఖ్యాప్రకీర్తితాః ౬౬

తా. పూర్వాషాఢమొదలు మూడునక్షత్రములయందును పూర్వాభాద్రయందును వర్షించెనేని యేడుద్రోణముల వృష్టిగలుగును

శ్లో. మైత్రమూలోత్తరాభాద్ర రేవతీవృష్టికృత్తథా,
క్రమాద్దినదినేశస్య నేత్రాబ్ధిద్రోణసంఖ్యయా ౬౭

తా. అనూరాధ మూల ఉత్తరాభాద్ర రేవతీనక్షత్రములయం దెం దెన్నిదినములు వర్షించునో అన్నియన్ని ద్రోణములనగా రెండుదినములైతే రెండుద్రోణములు నాలుగుదినములైతే నాలుగుద్రోణములు ఇటుల వృష్టిగలుగును

శ్లో. వసుర్వారణవైశాఖే జ్యేష్ఠర్క్షేవృష్టికృద్యది,
క్రమాద్వసుబుతుశ్చంద్ర ద్రోణంతువిధిసంఖ్యయా. ౬౮

తా. ధనిష్ఠ, శతభిషము, విశాఖ, జ్యేష్ఠ యీనక్షత్రములయందు వర్షించిన యథాక్రమముగ ఎనిమిది, ఆఱు, రెండు, పదునాలుగుద్రోణముల వృష్టిగలుగును (అనగా ధనిష్ఠలోవర్షించిన ఎనిమిదిద్రోణములు, శతభిషములో వర్షించిన నాఱుద్రోణములు, విశాఖలోవర్షించిన రెండుద్రోణములు, జ్యేష్ఠలోవర్షించిన పదునాలుగుద్రోణములు) వృష్టిగలుగునని తెలియంగవలయును

శ్లో. ఉత్తరాదిచతుష్కేస్యా ద్గురువృష్టిర్భవేద్యదా,
ప్రావృట్కాలేపివర్షంస్యా తథాద్రోణకవింశతి. ౬౯

తా. ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, పుష్యమి యీనక్షత్రములయందు వర్షించిన వర్షాకాలములో నిఱువదిద్రోణముల వృష్టిగలుగును

శ్లో. ఆర్ద్రాయాంపితృభేవృష్టి స్తథాద్రోణంత్రయోదశ,
ఆదిత్యోరగపూర్వాసు వృష్టిద్రోణంతథాష్టకమ్ ౭౦

తా. ఆర్ద్ర, మఖ యీనక్షత్రములయందు వర్షించిన పదమూడు ద్రోణములును, పునర్వసు, ఆశ్లేష, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వభాద్ర యీనక్షత్రములయందు వర్షించిన యెనిమిదిద్రోణములును వృష్టిగలుగును

వర్షకారణ చంద్రాదిగ్రహయోగములు

శ్లో. జ్యేష్ఠమాసేతుసంప్రాప్తే వృష్టిరుత్పద్యతేయది,
తస్మిన్సగ్రహచంద్రేతు ఫలంతత్రవిచార్యతే ౭౧

తా. జ్యేష్ఠమాసములో ముందుగ వర్షించునపుడు చంద్రుడేగ్రహముతో గూడియుండునో ఆగ్రహబలమునుబట్టి వృష్టిపరిమాణమును విచారించవలయును.

శ్లో. తత్కాలేగురుణాయుక్తే చంద్రేవృష్టిఫలప్రదః ,
శుక్రేందూసస్యఫలదా శుభయోర్బహువృష్టిదః. ౭౨

తా ఆకాలంబున చంద్రుడు గురువుతో జేరియుండినను శుక్రునితో జేరియుండినను వర్షించి సస్యవృద్ధియగును గురుశుక్రులిరువురితో చంద్రుడు జేరియుండిన విశేషముగ వర్షించును

శ్లో. భౌమేనసస్యనాశస్స్యా త్పూర్వవాయుర్బుధేనతు,
సౌరిణాసతతంరోగో రాజ్ఞాంకలహశ్చభవేత్ ౭౩

తా అకాలంబున చంద్రుడంగారకునితో గూడియుండిన సస్యనాశము గలుగును బుధునితో గూడియుండిన తూర్పుగాలివీచును శనితో గూడియుండిన రోగములున్ను రాజులకు కలహమున్ను గలుగును

శ్లో. రవిణాసంయుతేచంద్రే తథావృష్టిరుపాగతే,
సర్వసస్యవినాశస్స్యా త్కలహస్సర్వభూభుజామ్ ౭౪

తా. అకాలంబున చంద్రుడు సూర్యునితో గూడియుండిన వర్షములేక సర్వసస్యములు నశించును సమస్తదేశములయందు రాజులకు కలహము కలుగును

శ్లో రోహిణీసంయుతేర్కేందు ప్రాతర్మేఘవివర్జితే,
తస్మిన్ దినేపినైఋత్యే బహువృష్టిర్భవేద్ధ్రువమ్ ౭౫

తా రవిచంద్రులు రోహిణితో గూడియుండిన దినంబున ఉదయమున మేఘములులేక పిదప నైఋతిదిశయందు మేఘములు వ్యాపించిన బహువృష్టిగలుగును

శ్లో రవీందుధాతృభేసంస్థా ఇంద్రేశధనదోమరుత్,
దిశ్యైకమపితోవాయు స్సస్యవృద్ధిసువృష్టిదః ౭౬

తా రవిచంద్రులు రోహిణితో గూడియుండునపుడు వాయువ్యదిశవరకే దిశయందు గాలివీచినను సువృష్టియు సస్యవృద్ధియుగలుగును

శ్లో రోహిణ్యార్కేందుసంయుక్తే తత్కాలేభానుమండలే,
కృష్ణవర్ణందృశ్యమానే భూమౌమృత్యుః ప్రదృశ్యతే ౭౭

తా రోహిణిలో రవిచంద్రులుగూడిన దివసంబున రవిమండలము కృష్ణవర్ణముగ గానంబడినభూమియందపమృత్యువు వ్యాపించును

వర్షధారారుచినిర్ణయము

శ్లో. లవణంచబుచిర్హీనం కటుకంమిశ్రితంతథా,
మధురామ్లంచతిక్తంచరవ్యాదిరుచయఃక్రమాత్ ౭౮

తా రవి లవణరుచి, చంద్రుడుచప్పన, కుజుడు కారము, బుధుడు మిశ్రమము, గురువుమధురము, శుక్రుడుపులుసు, శనిచేదు, ఇటుల రవ్యాదిగ్రహములనుబట్టి వర్షధార రుచిని చూడవలయును

శ్లో॥ యస్యాం శేనూర్యసంయుక్తే యత్ర ప్రథమవర్షణాం,
తస్యాంశస్యాధివిజ్ఞేయ స్తత్కాలంరుచిసంభవః. ౧౯

తా॥ వృషభములో సూర్యుడేనవాంశమునందుండగ ప్రథమమున వర్షించునో నా వర్షధారకు నానవాంశాధిపతి రుచిగలిగియుండును

శ్లో॥ రోహిణీసంస్థితేభానౌ తస్మాసేవర్షతేయదా,
తద్బిందుముచ్ఛ్రకరగ్రాహ్యాం పీత్వాగ్రాహ్యంచతద్రుచిః. ౨౦

తా॥ రోహిణిలోరవియుండగ ప్రథమమందు వర్షించునపుడు నావర్షధారలనుపట్టుకొని రుచిచూడవలయును.

శ్లో॥ రుచిర్లవణమాచష్టే మధురంయావనాళకైః,
ఫలితంచతదర్ధేతు రుచిర్వర్షంనవర్షతి ౨౧

తా॥ ఆవర్షధారలు ఉప్పగనుండిన నాసంవత్సరమునందు గోధుమలు, జొన్నలు మాత్రము ఫలించును. రుచిహీనముగనుండిన వర్షమేలేకపోవును

శ్లో॥ మధురంపూర్ణఫలితం చామ్లంనిస్తండులంభవేత్,
కటుప్రియంగువృద్ధిస్యా న్మిశ్రరుచిదృశ్యతే. ౨౨
శ్యామాకాకోద్రవాదిశ్చ ఫలితంసూక్ష్మధాన్యకమ్,
తిక్తంకార్పాసకుసుమ తిలమాషాదికంఫలమ్. ౨౩

తా॥ ఆవర్షధారలు తియ్యగనుండిన సస్యములు సంపూర్ణముగ ఫలించును. పుల్లగనుండిన ధాన్యాదులలో పసురు(తాలు)విశేషముగపోవును వగరుగనుండిన కొఱ్ఱలు ఫలించును మిశ్రరుచిగలిగిన చామలు,రాగులు,సజ్జలు,ఆళ్లు ఈధాన్యములు ఫలించును చేగటుగనుండిన నువ్వులు,ఉలవలు,మినుములు, పెసలు,ప్రత్తి,పుష్పములు మొదలగునవి ఫలించును.

శ్లో॥ యదాతుసంస్థితేర్కేచ తథాచంద్రర్క్షమావసేత్,
యస్మిన్ వృక్షేక్షతేవృష్టి స్తత్ఫలంసముదీరయేత్ ౨౪

తా॥ సూర్యుడు రోహిణియందుండగ నేనక్షత్రమునందు వర్షించునో నానక్షత్రమునకు చెప్పినధాన్యము ఫలించును

శ్లో॥ అశ్విన్యాదిత్రితారాసు రేవత్యాంవర్షతేయది,
తస్మిన్నబ్దేమధ్యవృష్టిః కార్పాసకుసుమానితు ౨౫
ఫలితంతుతిలాదిశ్చ వ్రీహ్యాదిధాన్యనాశనమ్,

తా॥ రోహిణియందు సూర్యుడుండువపుడు అశ్విని, భరణి, కృత్తిక,రేవతి యీ నక్షత్రములయందు వర్షించిన నాసంవత్సరము మధ్యవృష్టిగలుగును ప్రత్తి, నువ్వులు, పుష్పములుమాత్రము ఫలించును

శ్లో॥. యోగ్రహేయత్రభుక్షేతు తదబ్దేవర్షతేఫలమ్. ౨౬

తా॥. ఏగ్రహ మేనక్షత్రమందుండునో ఆగ్రహమునకు జెప్పినధాన్యములు ఫలించును.

ఆషాఢమాసధాతువులు.

శ్లో. ఆషాఢేశుక్లపక్షేతు ప్రతిపద్యేందుబుక్షకే,
అభ్రచ్ఛన్నేతద్దినేతు పూర్వసస్యసమృద్ధిదః. ౧౭

తా॥ ఆషాఢశుద్ధపాడ్యమి మృగశిరానక్షత్రముండిన దివసంబున నాకసములో మేఘములువ్యాపించిన పూర్వసస్యములు ఫలించును

శ్లో. తద్దినేచాస్తమానేతు వారుణ్యామభ్రసంయుతే,
సమ్యక్ఫలమవాప్నోతి సర్వసస్యవసుంధరా. ౧౨

తా. ఆషాఢశుద్ధపాడ్యమిదివసంబున సాయంత్రము పశ్చిమదిశయందు మేఘములు వ్యాపించిన సర్వసస్యములు ఫలించును.

శ్లో. నవమీదశమీచైవ కృష్ణేవాశుక్లపక్షకే,
పౌర్ణమాసేప్రవర్షంస్యాత్పూర్వసస్యసమృద్ధికృత్. ౧౨

తా॥ ఆషాఢశుద్ధపౌర్ణమిదివసంబునగాని శుక్లకృష్ణపక్షములయందు నవమి దశమి యీతిథులయందుగాని వర్షించిన పూర్వసస్యములు సంపూర్ణముగఫలించును

శ్లో. ఆషాఢేశుక్లపౌర్ణమ్యాం దినయామచతుష్టయమ్,
శ్రావణాదిచతుష్కంస్యాత్సంపూర్ణంవర్షసంభవః ౨౦

తా॥ ఆషాఢశుద్ధపౌర్ణమియందు నాలుగుయామములు గాలివీచుచుండిన శ్రావణము మొదలు నాలుగుమాసములు సంపూర్ణముగ వర్షించును.

వర్షమునకు వెదురుగడకు కొడికట్టిచూచేలక్షణము.

శ్లో. నిర్వక్రంవైణవందండం చతుర్వింశతిహస్తకమ్,
తదంతేతుపతాకంచ బధ్నీయాన్మూర్ధిసంస్థితమ్. ౨౧
పతాకంతన్నిరీక్షేత తత్తద్వాయుంసమాదిశేత్,
అగ్నేఃపార్శ్వేచయామ్యేశాన్యే వాయువ్యేవృష్టిరుచ్యతే. ౨౨
కౌబేరీశాన్యనైఋత్యాం పవనేమారుతోద్భవః,
అనావృష్టిరితిఖ్యాతా పూర్వామాషాఢముచ్యతే. ౨౩

తా. ఇరువదినాలుగు హస్తప్రమాణముగల వెదురుగడనుపాతి చివరను కొడిగట్టి ఆషాఢశుద్ధపౌర్ణమి దివసంబున నుదయముమొదలు తూర్పాగ్నేయపశ్చిమ యీశాన్యము ఈనాలుగుదిశలయందు గాలివీచిన నాసంవత్సరంబున వర్షించును ఉత్తరదక్షిణనైఋతివాయువ్య యీదిశలయందు గాలికొట్టిన నాసంవత్సరమునందు వర్షించదు వైఫల్యము దిక్కుకొకనెల గానంబడునని తెలిసికొనవలయును

శ్లో. ఆషాఢేకృష్ణపాడ్యమ్యాం చతుర్థీపంచమీతథా,
షష్ఠ్యాంతువర్షితస్తత్రాబ్దే వృష్టిసస్యాభివృద్ధికృత్ ౨౪

తా. ఆషాఢబహుళపాడ్యమి, చవితి, పంచమి, షష్ఠి యీతిథులయందు వర్షించిన నాసంవత్సరంబున బాగుగవర్షించి సంపూర్ణముగ ఫలించును.

శ్లో. ఉదయేపూర్వవాయుస్స్యా త్సంపూర్ణ ఫలముచ్యతే,
అపరాహ్ణేతత్వనావృష్టి ర్మాసి భిఃపరికీర్తితా. ౯౫

తా॥ ఆషాఢమాసములో నుదయమున తూర్పుగాలివీచిన సంపూర్ణముగ వర్షించును. అట్టిగాలి యపరాహ్ణమునవీచెనేని వర్షించదు.

శ్లో. ఆషాఢేకృష్ణసప్తమ్యాం చంద్రేమీనస్థితేయదా,
పరివేషోథ వేదిందో స్తదాధాత్రీఫలప్రదా. ౯౬

తా॥ ఆషాఢబహుళసప్తమిదివసంబున చంద్రుడు మీనములోనుండగ చంద్రపరివేషము గానంబడిన భూమి చక్కగా ఫలించును

శ్లో. అష్టమ్యాంవాయుసంయుక్తే నవమ్యాం విద్యుతాయుతే,
దశమ్యాంరోహిణీయుక్తే తదబ్దేవృష్టికృద్భవేత్. ౯౭

తా॥ ఆషాఢబహుళఅష్టమి దివసంబున గాలివీచినను నవమిదివసంబున మెఱుపుగానంబడినను దశమిదివసంబున రోహిణీనక్షత్రముగూడినను ఆసంవత్సరమునందు వర్షించును

శ్లో. ఏకాదశ్యాదిదర్శాంతే వర్షతీమేఘమండలే,
ధాత్రీసంపూర్ణఫలదా సిద్ధంసస్యార్ఘవృద్ధయః. ౯౮

తా॥ ఆషాఢబహుళ యేకాదశి మొదలమావాస్యవరకంబరమున మేఘములు వ్యాపించి వర్షించిన సస్యములు చక్కగా ఫలించును ధాన్యములకు ధరలు గలిగియుండును

శ్రావణమాసధాతువులు.

శ్లో. శ్రావణ్యాంశుక్లపక్షేతు చిత్తాస్వాతీద్విదైవభే,
ఋక్షత్రయేతుధాతూనాం దశకంజాయతేయదా ౯౯

తా. శ్రావణశుక్లపక్షములో చిత్త స్వాతి విశాఖలయందు దశధాతువులు గానంబడిన నది శ్రావణమాసగర్భమని నెఱుంగవలయును

శ్లో. చిత్తాయాంజాయతేధాతు ర్మిత్రాద్యష్టర్క్ష వృష్టికృత్,
స్వాతీభాద్రపదా జ్యేష్ఠ ఋక్షేవృష్టిప్రజాయతే. ౧౦౦

తా॥ చిత్తలో దశధాతువులు గానంబడిన అనూరాధ మొదలెనిమిదినక్షత్రములలో వర్షించును

శ్లో. విశాఖాయాంతథాధాతు ఈశాద్యష్టర్క్ష వృష్టికృత్,
ఏవంక్రమాచ్ఛ్రావణ్యాం గర్భకాలముదీరయేత్. ౧౦౧

తా॥ విశాఖలో దశధాతువులు గానంబడిన ఆర్ద్ర మొదలెనిమిదినక్షత్రములయందు వర్షించును.

శ్లో. శుక్లేవాకృష్ణపక్షేవా శ్రావణ్యాందశమీయది,
అభ్రచ్ఛన్నాతతోవృద్ధి బహుసస్యార్ఘవృష్టికృత్. ౧౦౨

తా॥ శ్రావణమాసశుక్ల కృష్ణపక్షములయందు దశమిదివసంబున నాకసములో మేఘములువ్యాపించిన నది మొదలు విశేషముగ వర్షము అర్ఘవృద్ధి యివి గలుగును

శ్లో. శ్రావణ్యాంకృష్ణపక్షేతు చతుర్థ్యాంవృష్టికృత్సదా,
పూర్వసస్యవినాశస్స్యా ద్వృష్టిశ్చాపరధాన్యకమ్. ౧౦౩

తా॥ శ్రావణబహుళచవితి దినంబున వర్షించిన పూర్వసస్యములు చెడి యపరసస్యములు ఫలించును

శ్లో॥ శ్రావణ్యాం సమతిథ్యాంచ దృశ్యంతే యది ధాతవః,
హస్తర్క్షే పరివేషే తు పురతో బహువృష్టికృత్. ౧౦౪

తా॥ శ్రావణమాసములోని సమతిథులయందు దశధాతువులు గానంబడినను హస్తయందు పరివేషము గానంబడినను మొదలుకొని చక్కగ వర్షించును

శ్లో॥ నభోదర్శే తు వృష్టిస్స్యాద్యావద్భూమాప్లీవతి,
తావద్భూమా సస్యవృద్ధిర్బహుధాన్యవృష్టికృద్భవేత్. ౧౦౫

తా॥ శ్రావణబహుళ అమావాస్యదినంబున నెంతభూమివరకు వర్షించునో అంతభూమివరకు చక్కగ వర్షించి సస్యములు వృద్ధిబొందును ధాన్యములకు ధరలును కలిగియుండును

భాద్రపదమాసధాతువులు.

శ్లో॥ మాసే భాద్రపదే శుక్లే ప్రతిపత్తే స్తథోపరి,
యావన్మారుతఋక్షాంతే వృష్టిర్వాయుః ప్రదృశ్యతే ౧౦౬

తా॥ భాద్రపదశుద్ధపాడ్యమి మొదలు స్వాతినక్షత్రపర్యంతము వర్షము గాలి గలిగినట్టయిన పిదప వర్షించును

శ్లో॥ శతభాదిత్రిఋక్షేతు దృశ్యంతే దశధాతవః,
తస్మాచ్ఛేదంచ వృష్టిశ్చ సర్వసస్యాపరం ఫలమ్. ౧౦౭

తా॥ శతభిషము మొదలు మూడు నక్షత్రములయందు దశధాతువులు గానంబడిన వర్షించి పూర్వసస్యములు చెడి యపరసస్యములు ఫలించును

శ్లో॥ మాసే భాద్రపదే పూర్ణే గర్జితం వృష్టివర్జితమ్,
తద్దేశే వృష్టినాశశ్చ సస్యహానిస్తు జాయతే. ౧౦౮

తా॥ భాద్రపదశుద్ధపూర్ణిమ దినసంబున వర్షించకనే గర్జించినట్టయిన నా సంవత్సరము వర్షములేక సస్యములకు హానిగలుగును

శ్లో॥ పౌర్ణమాద్యేందుఋక్షాంతే తయోర్మధ్యే తు వృష్టిదః,
కార్తిక్యాం బహుళే వృష్టిస్సర్వసస్యసమృద్ధయః. ౧౦౯

తా॥ భాద్రపదశుద్ధపూర్ణిమ మొదలు మృగశిరలోగా వర్షించెనేని కార్తికమాసములో వర్షించి సస్యములు ఫలించును

ఆశ్వయుజమాసధాతువులు.

శ్లో॥ ఆశ్వీజమాససంప్రాప్తే శుక్లే మారుతభాదికే,
చతుర్ధే వర్షసంప్రాప్తే సంపూర్ణఫలముచ్యతే. ౧౧౦

తా॥ ఆశ్వయుజశుక్లపక్షములో స్వాతి మొదలు నాలుగునక్షత్రములయందు వర్షించిన సంపూర్ణముగ సస్యములు ఫలించును

శ్లో॥ తథా కృష్ణత్రయోదశ్యాం హస్తాద్యే పంచఋక్షకే,

వాయునాసంయుతావృష్టి స్సర్వసస్యసమృద్ధికృత్. ౧౧౧

తా ఆశ్వయుజ బహుళ త్రయోదశిదివసంబున హస్తమొదలు అయిదు నక్షత్రములయంగు గాలితో కూడ వర్షించిన సస్యములు చక్కగ వృద్ధియగును

శ్లో హస్తర్క్షేభానుసంప్రాప్తే మేఘస్సంప్రవర్షతి,
ధాత్రీసంపూర్ణఫలదా సుభిక్షంవృష్టిజాయతే ౧౧౨

తా హస్తయందు సూర్యుడుండగ వర్షించిన భూమి విశేషముగఫలించి సుభిక్షము గలుగును

## వర్షసూచకములు

శ్లో రవిసంక్రమణేకాలే పక్షాంతేపర్వసంధిషు,
తిథ్యంతేరాశిసంధౌవా లగ్నేవావృష్టికారణమ్ ౧౧౩

తా సూర్యసంక్రమణమందును పక్షాంతములయందును పర్వసంధులయందును లగ్నసంధులయందును వృష్టిగలిగిన నది వర్షమునకు చిహ్నమని తెలియంగవలయును

శ్లో స్థలేమండూకరోదశ్చ వృక్షారోహస్తథైవచ,
వృక్షమూలేతుఫేనశ్చ ద్వయోకోలాహలంభవేత్. ౧౧౪
మృగాదికంజలేస్థిత్వా మత్స్యాదానంజలోపరి,
పక్షిపాంసౌప్రవర్తేత భూనాగాభూతలేతథా ౧౧౫
వల్మీకారోహిణఃఛాగా అంసవాహాఃపిపీలికాః,
ద్వారాభిముఖగావస్తు గత్వాగావశ్చలంతితాః. ౧౧౬
కర్ణాచలంతిగావశ్చ క్షుతేనేవతథాతలే,
గుణాన్యేతానిసర్వాణి వృష్టికారణమేవహి. ౧౧౭

తా మిట్టనుకప్పలుగూసిన, నాకప్పలుచెట్లెక్కిన, వృక్షమూలములయందు నురుగుబెట్టిన, కప్పలుకలహించిన, మృగములు జలములోనిలిచిన, మత్స్యము లుదకములోనుండియెగిరిన, పక్షులు బూడిదెలోపొరలిన, భూనాగములు యెండలోపొరలిన, మేకలు పుట్టలెక్కిన, చీమలు గుడ్లుమోసిన, గోవులుగ్రామునకువిని దిక్కునకు నడిచిన, నవిచెలించియెగిరి చెవులుఝాడించిన, లేక నవి తుమ్మిన, దుమ్ములెగురునట్లు పరుగులిడిన, నివి వర్షచిహ్నములని తెలియంగవలయును

శ్లో. జలరోధఃప్రతిసూర్యే భానుర్యామేచమారుతః,
ఉభయంచాప్యుభయదోప్యథవావృష్టికృద్భవేత్ ౧౧౮
ప్రత్యగ్భాగేనృపాన్హంతిప్రాగ్భాగేహంతిమానవాన్.

తా సూర్యునికుత్తరభాగమునందు ప్రతిసూర్యుడుద్భవించిన వర్షించును దక్షిణముదిక్కు నుదయించిన గాలిగొట్టును. ఉభయపార్శ్వములయందు దయించిన నాదేశమునకు శత్రుభయముగాని లేక వర్షముగాని యీరెంటిలో నొకటిగలుగును పశ్చిమమున పుడితే రాజులకుకీడు. తూర్పునపుడితే మనుజులకుకీడు ఇటుల జనించును.

## ఇంద్రధనుస్సు

శ్లో॥ ఆషాఢే శ్రావణే జ్యేష్ఠే శుక్లపక్షేతు పశ్చిమే,
పురుహూతధనుర్జాతం సుభిక్షంవృష్టికృద్భవేత్ ౧౯

తా॥ ఆషాఢ శ్రావణ జ్యేష్ఠమాస శుక్లపక్షములయందు పశ్చిమమున ఇంద్రధనుస్సు గానంబడిన సువృష్టి, సుభిక్షము ఇవి గలుగును.

శ్లో॥. తన్మాసేషుచపుష్యాద్యా నక్షత్రేచేంద్రధన్వనః,
పశ్చిమేచేంద్రదిగ్భాగే ధనుర్వృష్టివినాశనమ్ ౨౦

తా॥ పై మాసములలో పుష్యమినక్షత్రముమొదలు ఏడునక్షత్రములయందు తూర్పు పశ్చిమముల నింద్రధనుస్సు గానంబడిన అనావృష్టియు క్షామడాంబరము ఇవి గలుగును.

శ్లో॥. ఉదయాస్తమయేసూర్యే మేఘచన్నేంద్రపశ్చిమే,
తథావిద్యుత్ప్రకాశేచ వృష్టినాశకరోభవేత్. ౨౧

తా॥ సూర్యోదయ సూర్యాస్తమయములయందు నాకసంబున మేఘములువ్యాపించి తూర్పుపశ్చిమములయందు మెఱుపుగానంబడిన వర్షము లేకపోవును

శ్లో॥. అభ్రచన్నంసర్వదిక్షు విద్యున్మధ్యేతటిత్వతః,
గోనేత్రాభావియద్భాగే ఉదయేశ్వాదరోదనమ్. ౨౨
వృష్టికారణమిత్యాహు స్సంధ్యయోశ్వానరోదనమ్,
పరచక్రపరంవిద్యా దథవావృష్టికృద్భవేత్. ౨౩

తా॥ నలుదిక్కుల మేఘములువ్యాపించి మధ్య నాకసంబున మెఱుపుగానంబడినను ఆమేఘములకు గోనేత్రఛాయగలిగినను సూర్యోదయసంధ్యాకాలములయందు శ్వానములు రోదనముచేసినను పరచక్రభయముగాని లేక వర్షముగాని గలుగును

## వర్షజనకమేఘస్వరూపములు

శ్లో॥ గిరిస్తరుర్గజాకార గోనాంబుజజనాస్తథా,
మకరోమత్స్యవరాహౌస్త్రీ మభ్రంద్రుష్టంచమాహిషమ్, ౨౪
నారీసరోవటాభశ్చ సౌధఖర్జూరసైకతమ్,
వీచీవృషభపర్యంక ధ్వజచామరఛత్రకమ్ ౨౫

తా॥ పర్వతములు, గజములు, వృక్షములు, పశువులు, కలువలు, మనుజులు, మొసళ్లు, మత్స్యములు, పందులు, ఒంటెలు, మహిషములు, స్త్రీ, వటవృక్షము, మేడ, ఖర్జూరవృక్షము, ఇసుకదిన్నె, అలలు, వృషభము, పట్టెమంచము, ధ్వజము, చామరము, ఛత్రము, వీటియాకారముపలె మేఘములు గానంబడిన విశేషముగవర్షించును

శ్లో॥. ప్రాక్ప్రత్యగ్గేగతైర్వృష్టి రుభయోస్సంధ్యయోర్యది
వంశోద్భవంలోహితాభ మథవాకృష్ణవర్ణకమ్. ౨౬

తా తూర్పుపశ్చిమములలో ద్విసంధ్యలయందు నాకసంబున వెదురులువలె మేఘములువ్యాపించి నవి నలుపువర్ణముగగాని రక్తవర్ణముగగాని గనుపించిన వర్షించును

శ్లో. వీణాకేతనకల్హారం సమూలంరక్తవాససమ్,
నరవానరమాయూర శ్వానజంబుకపన్నగాః ౧౨౭
భల్లూకదానవానీక బర్హిపింఛసమానభమ్,
దృశ్యంతేమేఘబృందాని సద్యోవృష్టేస్తుహేతవే ౧౨౮

తా వీణె, ధ్వజము, చంగలువ, ఎఱుపువస్త్రము, మనుజుడు, కోతి, నెమలి, శ్వానము, జంబుకము, సర్పము. ఎలుగుబంటు, రాక్షససైన్యము, నెమలిపింఛము, ఇటుల మేఘములుగానంబడిన తక్షణమే వర్షించును

శ్లో. కృష్ణమేఘాంతరేవిద్యుత్ క్షిప్రభశూన్యేతువాయునా,
అభ్రంతూలమివోద్ధూతం తస్మిన్నబ్దేనవర్షణమ్ ౧౨౯

తా నల్లటిమేఘములలో మెఱిసినను, మేఘములులేకనే నాకసమునందుమెఱిసినను, గాలిచే మేఘములు విచ్చిపోయినను నాసంవత్సరంబున వర్షించదు

శ్లో ఇంద్రనీలాంజననిభం మధ్యాహ్నేదృశ్యతేనభః,
సంధ్యాయాంశుభ్రవర్ణంచ దృశ్యతేవృష్టినాశనమ్. ౧౩౦

తా ఆకసము మధ్యాహ్నమందు కృష్ణవర్ణముగ గానంబడి సాయాహ్నమందు శుభ్రముగనుండిన వృష్టిగలుగదు

శ్లో. ధూమ్రవర్ణంతథాకాశం వ్యాఘ్రులాంచనమభ్రకమ్.
దృష్ట్వాఖంమేఘమధ్యేతు యదావృష్టివినాశనమ్. ౧౩౧

తా ఆకాశము పొగగమ్మినట్లును పులిచారలవలెను గానంబడినను మధ్యప్రదేశమునందు నిర్మలముగ గానంబడినను వృష్టిగలుగదు.

శ్లో. ప్రాతఃకాలేతుమాకారం మధ్యాహ్నే మేఘడాంబరమ్,
రాత్రౌనిర్మలమాకాశం తద్దేశేవృష్టినాశనమ్. ౧౩౨

తా ఉదయమున తుంపరలు మధ్యాహ్నమున మేఘడాంబరముగలిగి రాత్రియాకాశము నిర్మలముగగనుపించిన వృష్టిగలుగదు

## జలయోగలక్షణము.

శ్లో అర్కోమృగశిరశ్చైవ ఆర్ద్రాయాంసోమవాసరే,
షష్ఠ్యామంగారకశ్చైవ తృతీయాయామిందునందనః ౧౩౩
ఏకాదశ్యాంగురుశ్చైవ త్రయోదశ్యాంతుభార్గవః,
నైఋత్యాంశనివారశ్చ జలయోగాఃప్రకీర్తితాః ౧౩౪

తా. ఆదివారము మృగశిర, సోమవారమారుద్ర, షష్ఠి మంగళవారము, తదియ

బుధవారము, ఏకాదశి గురువారము, త్రయోదశి శుక్రవారము, మూలా శనివారము, ఇటు లగలిగిన జలయోగములని తెలిసికొనవలయును

## అశ్విన్యాది నక్షత్రములయందు బుధశుక్ర సంచారయోగము.

శ్లో. త్రయస్త్రయస్త్రయస్సప్త నవయుగ్మంయథాక్రమమ్,
దస్రాదిస్సప్తవింశర్క్ష స్థితౌశుక్రజ్ఞయోఃఫలమ్ ౧౩౫
అల్పవృష్టిరనావృష్టి రతివృష్టిర్జలాగమః,
వృష్టినాశోథ వేదవృష్టి బుధశుక్రసమాగమే. ౧౩౬

తా అశ్వినిమొదలు నిఱువదియేడు నక్షత్రములను ఆఱుభాగములు అనగా మూడునక్షత్రములచొప్పున భాగములు ౩ ఏడునక్షత్రము లొకభాగము, తొమ్మిదినక్షత్రము లొకభాగము, రెండునక్షత్రము లొకభాగము ఇటుల నిరువదియేడు నక్షత్రములను ఆఱుభాగములుగావించి మొదటిభాగపు ౩ నక్షత్రములయందు బుధశుక్రులు గూడియుండిన స్వల్పవృష్టియనియు, రెండవభాగపు ౩ నక్షత్రములయందు బుధశుక్రులు గూడియుండిన అనావృష్టియనియు, మూడవభాగపు ౩ నక్షత్రములయందు బుధ శుక్రులుగూడియుండిన నధికవృష్టియనియు, నాల్గవభాగమగు ౭ డు నక్షత్రములయందు బుధ శుక్రులు గూడియుండిన సువృష్టియనియు, ఐదవభాగమగు ౯ నక్షత్రములయందు బుధ శుక్రులు గూడియుండిన వృష్టిహానియనియు, ఆఱవభాగమగు ౨ నక్షత్రములయందుబుధ శుక్రులు గూడియుండిన సువృష్టిగలుగువనియు తెలిసికొనవలయును.

## వర్ష ధాతువులు.

శ్లో. మార్గశీర్షాదిమాసస్య షాణ్మాసాధాతవోదృశాః,
శీతంహేమంచవాయుశ్చ విద్యుద్వృష్టిశ్చగర్జితమ్. ౧౩౭
తతోజ్యేష్ఠాదిషణ్మాసా స్తద్దినేవృష్టిమాప్నుయాత్,

తా మార్గశిరమాసము మొదలు ఆఱుమాసములు క్రమముగ శీతము, మంచు, గాలి, మెఱుపు, వృష్టి, గర్జితము, ఈయాఱుధాతువులు గలిగిన జ్యేష్ఠమాసము మొదలు ఆఱు మాసములు చక్కగవృష్టిగలుగును మఱియు పైశనుపరచినధాతువు లేమాసములో నేదివసంబునగానంబడునో ముందురాబోయ్యేడిమాసములలో నాదివసమునందు చక్కగవర్షించునని తెలిసికొనవలయును

## వర్ష ఫణిలక్షణము.

శ్లో. కృత్తికాదిభవేద్భానో, సాభిజిచ్చక్రమేణతు. ౧౩౮
సప్తనాడీవిధిస్తత్ర జ్ఞాతవ్యంపన్నగాకృతిః,

తా అభిజిత్సహితముగ నిఱువదియెనిమిదినక్షత్రములను కృత్తికమొదలు సర్పాకారముగ నేడు నాడులుగ వ్రాయవలయును.

## సప్తనాడులు.

శ్లో. ప్రథమాచామృతానాడి ద్వితీయావ్యజలదాస్మృతా. ౧౩౯

తృతీయాచరసానాడీ చతుర్థా సౌమ్యనాడికా,
పంచమీదహనాఖ్యాతత్షష్ఠీ వాతాభిధాయిని ౧౮౦
సప్తమీచండనాడీస్యా దేతావై సప్తనాడికాః,

తా. మొదటిది అమృతనాడి, ౨ వది జలనాడి, ౩ వది రసనాడి, ౪ వది సౌమ్య నాడి, ౫ వది దహననాడి, ౬ వదివాతనాడి, ౭ వది చండనాడి యిటులనాడులుయేడు.

నాడులకధిపతులు వాటినక్షత్రములు

శ్లో. కృత్తికాచవిశాఖాచ మైత్రాఖ్యంభరణీతధా,
ఊర్ధ్వాఖ్యంశనినాడీయం చండనాడీప్రకీర్తితా. ౧౮౧

తా కృత్తిక, విశాఖ, అనోరాధ, భరణి, ఇవి చండనాడినక్షత్రములు ఈప్రథమనాడి కధిపతి శని ఇది ఊర్ధ్వనాడి

శ్లో. రోహిణీస్వాతిశక్రాశ్వి ద్వితియ్యానాడికామతా,
ద్వితియ్యాప్రభవానాడి ఆదిత్యావాయుసంయుతా ౧౮౨

తా రోహిణి, స్వాతి, జ్యేష్ఠా, అశ్విని, ఈనాలుగు వాయునాడి ఈనాడికి సూర్యుడధిపతి

శ్లో, సౌమ్యచిత్రాతధామూలా పౌష్ణభంచచతుష్టయమ్,
తృతియ్యాంగారకానాడి దహనాఖ్యాతథైవచ. ౧౮౩

తా మృగశిర, చిత్త, మూల, రేవతి, ఈ నాలుగునక్షత్రములు దహననాడి ఈ మూడవనాడి కధిపతి అంగారకుడు

శ్లో రౌద్రహస్తాతధాతోయ ఉత్తరాభాద్రవేవచ,
చతుర్థీజీవనాడీయం నీరసాఖ్యాప్రకీర్తితా ౧౮౪

తా ఆర్ద్ర, హస్త, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర ఈనాలుగునక్షత్రములు నీరసనాడి ఈనాలవనాడికధిపతి బృహస్పతి

శ్లో పునర్వసూత్తరాఫల్గు న్యుత్తరాషాఢతారకాః,
పూర్వాభాద్రాచశుక్రాఖ్యా పంచభంజలనాడికా. ౧౮౫

తా పునర్వసు, ఉత్తర, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర ఈనాలుగునక్షత్రములు జలనాడి ఈయైదవజలనాడి కధిపతి శుక్రుడు.

శ్లో పుష్యభంపూర్వఫల్గున్య ప్యభిజిచ్ఛతతారకా,
షష్టనాడీబుధాఖ్యాచ మేఘనాడీప్రకీర్తితా. ౧౮౬

తా పుష్యమి, పుబ్బ, అభిజిత్, శతభిషము, ఈనాలుగునక్షత్రములు మేఘనాడి ఈయారవనాడి కధిపతి బుధుడు

శ్లో ఆశ్లేషాచమఘావిష్ణుః ధనిష్ఠాచతథైవచ,
శుద్ధనాడీచసప్తాఖ్యాం చంద్రాఖ్యాచరసాజలమ్. ౧౮౭

తా॥ ఆశ్లేష, మఖ, శ్రవణం, ధనిష్ఠ, ఈనాలుగునక్షత్రములు జలనాడి ఈయేడ ఏజలనాడి కధిపతి చంద్రుడు

శ్లో॥ పియూషనాడీగశ్చంద్ర తత్రనాడీసుభానహమ్,
త్రిచతుఃపంచపానియ్యం దినాన్యత్రచసప్తచ. ౧౪౮

తా॥ చంద్రుడమృతనాడిలోనుండిన ౩,౪,౫, లేక ౭ దినములయందువర్షించును

శ్లో॥ ఏవంజలాఖ్యనాడిస్థే చంద్రేమిశ్రగృహాన్వితే,
దినార్థందివసాఃపంచ జాయతేచజలంమహాత్. ౧౪౯

తా॥ జలనాడియందు చంద్రుడుండినను నాచంద్రుడు మిశ్రగ్రహముతోగూడి యుండినను ఒకటిన్నరదినముగాని, లేక నైదుదినములుగాని వర్షించును

శ్లో॥ నీరసనాడిస్థితేచంద్రే తత్ర తేఖేచరాయది,
యావద్దినార్థకంత్రింశ ద్దివసాజ్జాయ తేజలమ్. ౧౫౦

తా॥ నీరసనాడియందు చంద్రునితోకూడ గ్రహములుండిన ఒకటిన్నరదినముగాని లేక ముప్పదిదినములుగాని వర్షించును

శ్లో॥ అమృతాదిత్రయేయత్ర వర్తంతేసౌమ్యఖేచరాః,
తత్రవృష్టిఃతదాజ్ఞేయా ధృత్యర్కనృపవాసరాః ౧౫౧

తా॥ అమృతనాడిమొదలు ౩ నాడులయందు సౌమ్యగ్రహములుండి వాటిలో చంద్రుడుగూడజేరిన పదునెనిమిదిగాని, ౧౨ గాని పదియాఱుగాని దివసంబులువర్షించును

శ్లో॥ సౌమ్యనాడీగతాస్సర్వే వృష్టిదాస్తేదినత్రయమ్,
శేషనాడ్యాంస్థితావాత వృష్ట్యవృష్టిప్రదాగ్రహాః. ౧౫౨

తా॥ సౌమ్యనాడియందు సమస్తగ్రహములుండిన ౩ దినములువర్షించును తక్కిన నాడులయందుగ్రహములుండిన గాలిచే మేఘములువిచ్చిపోయి తుషారవృష్టియగును.

శ్లో॥ యామ్యనాడిస్థితాఃక్రూరాః అనావృష్టిభవేత్తద,
శుభయుక్తేజలాశ స్త శుభవృష్టిప్రదాగ్రహాః. ౧౫౩

తా॥ యామ్యనాడియందు క్రూరగ్రహములుండిన ననావృష్టిగలుగును ఆనాడియందాక్రూరగ్రహములు శుభులతోగూడ జేరియుండిన మధ్యవృష్టిగలుగును

శ్లో॥ ఏకనాడీసమారూఢౌ చంద్రమోధరణీసుతౌ,
యదిచంద్రస్తదాజీవో తథావారిమయీంమహీమ్. ౧౫౪

తా॥ ఏకనాడియందు చంద్రాంగారకులుగాని చంద్రగురువులుగాని గూడియుండిరేని విశేషముగవర్షించి భూమిని జలమయంబుగజేసును

శ్లో॥ బుధశుక్రౌయుతౌయత్ర గురుణాచసమన్వితః,
చంద్రయోగేతథాకాలే జాయతేవృష్టిరుత్తమా ౧౫౫

తా॥ బుధశుక్రగురువు లేకరాశియందుండగ చంద్రుడుగూడజేరినవిశేషవృష్టిగలుగును

శ్లో. వృష్టిర్నాశే పౌష్ణభేచ దస్రర్క్షేచనవర్షతి,
అహిర్బుధ్న్యాపూర్వసస్యం పరసస్యాని రేవతి ౧౫౬

తా రేవతి అశ్వినికార్తెలయందు వర్షించిన పదినక్షత్రములయందు వర్షించదు ఉత్తరాభాద్రయందు వర్షించిన పూర్వసస్యములుచెడును

శ్లో. అశ్వినీపూర్వసస్యాని పరసస్యాని రేవతి,
భరణీసర్వసస్యాని కృత్తికాసర్వవర్ధని. ౧౫౭

తా అశ్వినికార్తెలయందు వర్షించిన పూర్వసస్యములును రేవతికార్తెయందు వర్షించిన నపరసస్యములును ఫలించును భరణికార్తెయందు వర్షించినను కృత్తికయందు వర్షించినను సర్వసస్యములు ఫలించును

శ్లో. వాగీశవసుధాపుత్రా వేకనాడిగతేభువి,
జలరాశిగతేచంద్రే కుర్యాదేకార్ణవాంమహీమ్. ౧౫౮

తా బృహస్పతి అంగారకు లేకనాడియందుండునపుడు చంద్రుడు జలరాశియందుండిన భూమియందేకార్ణవమగునట్లు వృష్టిగలుగును.

శ్లో. కుజస్తుపురతోగచ్ఛే ద్భానుభార్గవయోరపి,
తుషారవృష్టిఃపర్జన్యః వర్షంన్యాత్ఖండమండలే ౧౫౯

తా. సూర్యశుక్రులకుముందు కుజుడునడిచిన భూమండలమందు తుషారముగను ఖండముగను వర్షించును

శ్లో. గురోస్థితేచజామిత్రే సమసప్తగ్రహోయది,
జామిత్రేచగురౌయత్ర అనావృష్టిర్భవేత్తదా ౧౬౦

తా గురుశుక్రులుసమసప్తకమందును రవిగురులుసమసప్తకమందును ఉండిరేని వృష్టిగలుగదు.

శ్లో. శుభనక్షత్రమారుహ్య గురుచారగతైర్గ్రహైః,
చంద్రమాస్తుగతేవృష్టిం నాడీచక్రవ్యవస్థితః ౧౬౧

తా శుభగ్రహనాడియందు శుభగ్రహంబులుండి వాటితో చంద్రుడుగూడియుండిన విశేషవృష్టిగలుగును

శ్లో. సౌమ్యగ్రహయుతేచంద్రే సౌమ్యనాడ్యాస్తుగోచరే,
జలనాడీస్థితేచైవ వృష్టియోగాఃప్రకీర్తితాః ౧౬౨

తా చంద్రుడు సౌమ్యనాడియందు సౌమ్యగ్రహములతోచేరియుండినను జలరాశియందుండినను వృష్టియోగమగుటచే చక్కగ వర్షించును

శ్లో. క్రూరఃక్రూరేణసంయుక్తే సౌమ్యస్సౌమ్యేనసంయుతః,
దుర్దినంచభవేత్తత్ర మిశ్రైర్మిశ్రముదాహృతమ్. ౧౬౩

తా క్రూరగ్రహనాడియందు క్రూరగ్రహములును శుభగ్రహనాడియందు శుభగ్రహములును గూడియుండిరేని మేఘములువ్యాపించి దుర్దినముసాకలుగజేసి స్వల్పవృష్టి గలుగజేయును ఆగ్రహములు మిశ్రములుగనుండిన మిశ్రముగనే వర్షించును.

శ్లో. ఏకత్రబుధశుక్రాభ్యాం యదితత్రభవేచ్ఛశీ,
మహావృష్టి స్తథాజ్ఞేయా సౌమ్యనాడీగతగ్రహైః ౧౬౪

తా ఏకరాశియందు బుధశుక్రులతో చంద్రుడుగూడియుండినను సౌమ్యనాడి యందుండు గ్రహములతో చంద్రుడు గూడియుండినను విశేషముగ వర్షించును

శ్లో. యదాశుక్రశ్చసౌమ్యశ్చ భాస్కరేనాడిగోచరే,
ఏకత్రవిచరిష్యంతి కుర్యాదేకార్ణవాంమహీమ్ ౧౬౫

తా బుధశుక్రు లేకరాశియందుండి సూర్యనాడిలో సంచరించిరేని యేకార్ణవము గ వర్షించును

శ్లో. శనైశ్చరార్కచంద్రాణాం నాడీభేదోయదాభవేత్,
తదాచవర్తతేయుద్ధం దివిచోత్పాతసంభవః ౧౬౬

తా శనిరవిచంద్రుడు విషమముగనుండి వేరువేరునాడులయందు సంచరించిరేని యుత్పాతములు జనించును రాజులకుపరస్పరము కలహములు సంభవించును

శ్లో. సితనాడ్యాంభవేత్కావ్యః తేజస్తేజస్విసంభవః,
వర్షాకాలేజలైఃపూర్ణా ఫలితాచవసుంధరా ౧౬౭

తా శుక్రనాడియందు శుక్రుడుండి తేజస్సుగలవాడైన వర్షాకాలమునందతివృష్టిగలిగి భూమి విశేషముగఫలించును

శ్లో పురుషఃపురుషస్త్వాతః సతాపంచనపుంసకః,
స్త్రీస్త్రీచదుర్దినంప్రోక్తం స్త్రీపుంసౌవృష్టిరుచ్యతే. ౧౬౮

తా పురుషగ్రహము లేకరాశిలోజేరిన తాపము, నపుంసకగ్రహము లేకరాశిలోజేరిన శీతము, స్త్రీగ్రహము లేకరాశిలోజేరిన దుర్దినము స్త్రీపురుషగ్రహము లేకరాశిలోజేరిన వృష్టి ఇవి గలుగును.

శ్లో స్త్రీనపుంసకయోర్వాయుః పున్నపుంసకయోర్జలమ్,
మకరంచకులీరంచ కుంభమీనౌతథైవచ ౧౬౯
ఏతానివృష్టింకుర్వంతి చత్వారోజలరాశయః.

తా స్త్రీనపుంసకగ్రహము లేకరాశిలోగూడిన వాతము, పురుష నపుంసకగ్రహము లేకరాశిలోగూడిన వృష్టిగలుగును మకరకర్కటకుంభ మీనములు జలరాసులు ఇవి వర్షముగలుగజేయును

శ్లో. స్వాంశనాడిస్థితేవృష్టి రన్యథానైవవర్షతి,
దహనాఖ్యాల్పవృష్టిస్స్యా జ్ఞాతవ్యంవృష్టిలక్షణమ్. ౧౭౦

తా స్వస్వనాడులయందు చంద్రాదిగ్రహములుండిన వృష్టిగలుగును ఇతరనాడులయందుండిన వృష్టిగలుగదు దహననాడియందుండిన స్వల్పవృష్టిగలుగును.

గ్రహసంచారయోగములు

శ్లో. రేవతీరోహిణీస్వాతి అనూరాధాతథైనచ,

అతిదాహమనావృష్టి రేవతీచా స్తేయదాకుజః. ౧౭౧

తా॥ రేవతి, రోహిణి, స్వాతి, అనోరాధ యీనక్షత్రములయం దంగారకుడుండిన వృష్టిగలుగదు అతితాపము గలుగును

శ్లో॥ కుజక్షేత్రగతేమార్గే యదాచరతిభాస్కరః,
తుషారోవర్తతేదేవి ఖండంఖండంప్రవర్షతి ౧౭౨

తా॥ కుజుడునడిచేమార్గములో సూర్యుడునడిచిన తుషారవృష్టియు, ఖండవృష్టియు, ఇవి గలుగును.

శ్లో॥ యదాశుక్రస్యసౌమ్యస్య పురతోరవిమండలమ్,
సంవర్తజలయోగోయం జలార్ద్రాంకురుతేమహీమ్ ౧౭౩

తా॥ శుక్రబుధులయొక్క ముందుగ సూర్యుడునడిచిన విశేషవృష్టిగలుగును. ఇది సంవర్తజలయోగ మనబడును.

శ్లో॥ జలరాశిగతేచంద్రే జామిత్రేనవపంచమే,
అర్కాస్సౌరిర్భృగుశ్చైవ కుర్యాజ్జలమయీంమహీమ్. ౧౭౪

తా॥ జలరాశియందు చంద్రుడుండగ నాచంద్రునికి నాలుగులోగాని యైదులోగాని తొమ్మిదిలోగాని సూర్యశనిశుక్రులుండిరేని భూమియందు జలార్ణవమగునట్లు వర్షించును

శ్లో॥ గ్రహాణాముదయేచాస్తే యదావక్రత్వమాగతే,
తదావర్షంతిజీమూతాః కేదారాస్సాగరోపమాః ౧౭౫

తా॥ గ్రహములయొక్క యుదయాస్తమయములయందును ఆగ్రహములు వక్రించుకాలమునందును సూర్యసంక్రమణకాలమునందును విశేషముగవర్షించి భూమియందంతయు సముద్రమువలె జలము నిండియుండును

శ్లో॥ బుధశుక్రోదయేతత్ర గురుణాచసమన్వితే,
చంద్రయోగంతుతత్కాలే జాయతేవృష్టిరుత్తమా. ౧౭౬

తా॥ బుధశుక్రోదయములయందు గురువుతో చంద్రుడుగూడియుండిన నది చంద్రయోగమనబడును అట్టియోగకాలంబున విశేషముగ వర్షించును.

శ్లో॥ జలరాశ్యధిపత్రైస్తు చంద్రమాయదిసంయుతః,
తద్రాశౌవర్షతేతస్మిన్ తదృక్షేషుతదాభవేత్. ౧౭౭

తా॥ జలరాశ్యధిపతులతోగాని యట్టి రాసులయందుగాని యానక్షత్రములయందుగాని చంద్రుడుగూడిన వృష్టిగలుగును.

శ్లో॥ జలయోగేయదాచంద్రే తాదాసుగ్రహసంస్థితే,
క్రూరయుక్తస్తదాకాలే తత్కాలేపూర్ణవృష్టిదాః ౧౭౮

తా॥ జలనక్షత్రములయందు చంద్రుడుండగ క్రూరగ్రహసంబంధము గలిగినను వర్షించును.

శ్లో. ఉదయాస్తమయేకాలే వక్రయుక్తేధసంక్రమే,
జలనాడీగతాఖేటాః తుషారావృష్టిదాగ్రహాః ౧౭౯

తా॥ గ్రహాము లుదయాస్తమయములయందు వక్రించినను సంక్రమణకాలమునం
గు జలరాశియందుండినను తుషారవృష్టిగలుగును అనగా మంచువలె వానకురియును

శ్లో. రవిర్గురు స్తథాసౌమ్యః స్త్రీబిశ్చంద్రేసమాగతే,
జలపాతంమహారౌద్రం ఇత్యుక్తంబ్రహ్మయామిళే. ౧౮౦

తా॥ రవిగురుబుధులతో చంద్రుడుగూడెనేని విశేషముగ వర్షించునని బ్రహ్మ
యామళమందు జెప్పియున్నది

శ్లో. కుజశ్చంద్రేణసంయుక్తో బుధశుక్రౌతుపంచమే,
అతివృష్టిశ్చలోకానా మితలంపాకనిశ్చయః. ౧౮౧

తా॥ చంద్రునితో కుజుడుగూడునపు డాకుజునికి అయిదులో బుధశుక్రులుండిన
నతివృష్టియగునని అంపాకమందు జెప్పియున్నది.

శ్లో. చంద్రయుక్తోభృగుశ్చాథ రాశిభాగసమన్వితః,
తత్కాలేబుధభౌమౌతు చతుర్థేచాల్పవృష్టికృత్ ౧౮౨

తా॥ చంద్రునితోశుక్రుడుగూడి రాశిభాగములలో సమానైనపుడును ఆశుక్రునికి
చతుర్థమునందు బుధకుజులు కలిసియుండునపుడును అల్పవృష్టిగలుగును

శ్లో. భౌమభార్గవసౌమ్యాశ్చ రాశౌవృష్టిఫలప్రదాః,
ఏకరాశౌస్వభాగేషు చాన్యభాగేషుస్వల్పదాః ౧౮౩

తా॥ కుజబుధశుక్రు లేకరాశియందుండిరేని వృష్టిగలుగును స్వభాగములయం
దుండినను అతివృష్టిగలుగును అన్యభాగములయందుండిన కొద్దిగవర్షించును

శ్లో. అన్యభాగాదిసంస్థాశ్చ తీరప్రాప్తంచవర్షతి,
త్రిభాగయుక్తోయేవాపి ఇందుభౌమజభార్గవాః ౧౮౪
తత్రస్థేనప్రవర్షశ్చ దశశుక్రేణవీక్షితః,
పాదంవర్షంభవేద్భూమా వాయునాచాతివృష్టికృత్. ౧౮౫

తా॥ కుజబుధశుక్రచంద్రు లేకరాశిని స్వాంశలు గాక భిన్నాంశములుగ నుండిరేని
స్వల్పముగ వర్షించును కుజబుధశుక్రులు ప్రత్యేకముగను అంశలయందుండునపుడు చం
ద్రుడు రవికుజులతో గూడి పదియవయింట శుక్రునిచే జూడబడిన గాలితోగూడ విశేష
వృష్టిగలుగును.

శ్లో. జన్మరాశ్యావరస్థానం శుక్రభౌమబుధేందవః,
అతివృష్టిఫలప్రాప్తి రిత్యేవంమనురబ్రవీత్ ౧౮౬

తా॥ శుక్రబుధచంద్రు లేకరాశినుండిన నది జన్మరాశియగును గావున నతివృష్టి
గలుగునని మనువుంచించె

శ్లో. బుధభార్గవయోర్మధ్యే భౌమేతిష్ఠతివాయవః,

రవిమధ్యేగతేతస్మిన్ సముద్రమపిశోషయేత్ ౧౮౭
శశిమధ్యేమహాగర్భం తిమిరంమేఘసంకులమ్,
అతివాయుశ్శిలాపాతం జలపాతంజగత్రయే ౧౮౮

తా. బుధశుక్రులమధ్య నంగారకుడుండిన విశేషముగ గాలికొట్టును సూర్యుడుండిన వృష్టిలేకసముద్రమునుగూడ శోషించును. చంద్రుడుండిన మేఘగర్జితము విశేషముగు గాలి వడిగండ్లు వీటితోగూడ చీకట్లుకమ్మి వర్షించును

శ్లో. సింహారాశిగతశ్చంద్రః వృషభేభార్గవస్థితిః,
యుగ్మకర్కటయోస్సౌమ్యః పాదవృష్టిఫలప్రదః ౧౮౯

తా సింహమందు చంద్రుడు వృషభమందుశుక్రుడు మిథునకర్కాటకములయందు బుధుడు ఇటులనుండిరేని పాతికభాగము వర్షించును.

వర్షప్రశ్న. శ్లో. లగ్నాదిద్ధనవిక్రమాప్త మభృగుస్సౌరీచవక్రాగతౌ,
తస్మిన్ప్రచ్ఛతిచేద్భవిష్యతి మహావృష్టిస్సమంతాద్భువి. ౧౯౦
సౌరిర్వాయదిభార్గవైక వనినెల్లగ్నాద్విధుస్సప్తగః,
తావద్వర్షతినాగరోప మగతఃసర్వంసహానందనః ౧౯౧

తా లగ్నమునకు ౫-౨-౩ ౧. రానులయందు శుక్రశనులు వక్రించకనుండినను ఏడవరాశియందు చంద్రుడుండినను విశేషవృష్టిగలుగునని ప్రశ్నచెప్పవలెను

శ్లో. జీవేషట్పంచమేచంద్రే బుధశుక్రనిరీక్ష్యతే,
అతివృష్టిశ్చలోకేస్మి న్మధ్యేగర్జితసంకులమ్. ౧౯౨

తా. ప్రశ్నలగ్నమునకారింట గురుచంద్రులుండి వారినిబుధశుక్రులు చూచిరేని మేఘములుకమ్మి ఉరుములతోగూడ విశేషముగ వర్షించును

శ్లో జలరాసిగతేచంద్రే జలరాశ్యుదయేపివా,
లగ్నాధిపేధిమిత్రస్థే తథాప్రశ్నేప్రవర్షణమ్ ౧౯౩

తా. వర్షప్రశ్నకాలమునందు జలరాశి యుదయమైనను జలరాశియందు చంద్రుడుండినను లగ్నాధిపతి మిత్రస్థానమునందుండినను అతివృష్టిగలుగునని చెప్పవలయును.

శ్లో. తత్ప్రశ్నేశుక్లపక్షేతు లగ్నాదౌబుధశ్శుభాః,
తస్మిన్ కేంద్రగతేచైవ తదావర్షతిసర్వతః ౧౯౪

తా వర్షప్రశ్నశుక్లపక్షముగనుండి కేంద్రస్థానములయందు శుభలుండిరేని వృష్టిగలుగును

## బుధశుక్రుల యుదయాస్తమయములు.

శ్లో. సౌమ్యాచ్ఛుక్రోదయేతాపం శుక్రాత్సౌమ్యోదయేజలమ్,
విద్యుద్దక్షిణవాయుర్వై సస్యవృద్ధిర్భృగూదయే ౧౯౫

తా. వర్షాకాలమునందు బుధునికిముందు శుక్రుడుదయించిన తాప మధికమగును శుక్రునికిముందు బుధుడుదయించిన వృష్టిగలుగును దక్షిణవాయువ్యదిశలయందు మెఱుపుగానంబడిన సస్యవృద్ధిగలుగును.

## ఉత్తరమధ్యదక్షిణ నక్షత్రములసంఖ్య.

శ్లో. ఉత్తరేమధ్యమేయామ్యే యామ్యర్క్షాణినవత్రికమ్,
ఉదయాస్తగురుస్తత్ర ఫలంవక్ష్యామితచ్ఛృణు ౯౬

తా మేరువుకు ఉత్తరమధ్యదక్షిణ నక్షత్రములనగా భరణి మొదలు ౯ నక్షత్రములు ఉత్తరమునను పుబ్బ మొదలు ౯ నక్షత్రములు మధ్యమునను, పూర్వాషాఢ మొదలు ౯ నక్షత్రములు దక్షిణమునను ఇటుల ౨౭ నక్షత్రములను లెక్కింపవలయును.

శ్లో. కృష్ణాష్టమ్యాంచతుర్దశ్యాం అమాయాంతుభృగుర్యది,
ప్రాగీశాన్యోదయేతత్ర సస్యవృద్ధిఃప్రజాయతే. ౯౭

తా కృష్ణాష్టమి, చతుర్దశి, అమావాస్య ఈదినములయందు తూర్పు యీశాన్యములలో శుక్రుడుదయించిన సస్యవృద్ధియగును

శ్లో సమీరభుజగత్ష్రేవ చిత్రాచేదుదయగృహః,
రాజ్ఞాంకీర్తివిహీనోవా వృష్టిర్వానాశయేత్తదా

తా. స్వాతి, ఆశ్లేష, చిత్త ఈమూడు నక్షత్రములయందు శుక్రుడుదయించిన రాజులకు కీర్తిహానియు, వర్ష ప్రతిబంధము ఇవి గలుగును.

శ్లో. జ్యేష్టమాఖేమార్గశీర్షేనభస్యే కార్తికాయాంచేద్భార్గవస్యోదయాస్తౌ,
సూర్యేందోశ్చేచ్ఛోపరాగః స్తదానీంవృష్టేర్నాశంపూర్వమాహుర్మునీంద్రాః. ౯౯

తా జ్యేష్టము,మాఘము,మార్గశీర్షము,శ్రావణము,కార్తికము ఈమాసములయందు శుక్రుడుదయించినను అస్తమించినను సూర్యచంద్రగ్రహణములుంగలిగిన సువృష్టిగలంగదు

శ్లో. రవేరుత్తరభాగేతు భార్గవేచోదితేసతి,
భూమానమంతాద్వృష్టిస్యా త్సర్వసస్యసమృద్ధయః. ౧౦౦

తా సూర్యునికి ఉత్తరభాగములో శుక్రుడుదయించిన భూమియందు సర్వసస్యములు సమృద్ధిగఫలించును

శ్లో. భరణ్యాదిచతుర్థేతు భార్గవేచోదయాస్తగే,
తేజోహానిర్నృణాంసర్వే ఫలితాధాన్యరాశయః. ౧౦౧

తా భరణి మొదలు నాలుగునక్షత్రములలో శుక్రునికుదయాస్తములు గలిగిన ప్రజలకు తేజోహానియు, విశేషముగ ధాన్యఫలితము గలుగును

శ్లో. రౌద్రభాదిచతుర్థేతు ఉదయేచాస్తగేభృగా,
విప్రపీడాప్రజాయంతే సస్యవృద్ధిఃప్రజాయతే. ౧౦౨

తా ఆర్ద్ర మొదలు నాలుగునక్షత్రములయందు శుక్రునికుదయాస్తమములు గలిగిన విప్రులకు పీడయు, సస్యములకు వృద్ధియుగలుగును

శ్లో. భార్గవస్యోదయేచాస్తే యదాపైతృకపంచభే,
నృపాణాంచనరాణాంచ పశూనాంమరణంధ్రువమ్. ౧౦౩

తా॥ మఖాపంచకమందు శుక్రోదయాస్తమయములుగలిగిన మనుజులకును రాజులకును పశువులకును మరణములు సంభవించును

శ్లో॥ జ్యేష్ఠాదిపంచకర్క్షేతు దుర్భిక్షంసర్వభూమిషు,
స్వాతిత్రయేభృగోశ్చాస్తే చోదయేప్రతివర్షతి. ౨౦౪

తా॥ జ్యేష్ఠమొదలైదు నక్షత్రములయందు శుక్రునియుదయాస్తమయములు గలిగిన సర్వభూములయందు దుర్భిక్షము వాటిల్లు. స్వాతిమొదలు మూడునక్షత్రములయందుదయాస్తమయములుగలిగిన విశేషముగ వర్షించును

శ్లో. ధనిష్ఠాపంచకర్క్షేషు భార్గవేచోదయాస్తగే,
నృపాణామాహవంప్రాహుః సస్యవృద్ధిఃప్రజాయతే. ౨౦౫

తా॥ ధనిష్ఠాపంచకమునందు శుక్రోదయాస్తమయములు గలిగిన రాజులకు పరస్పరయుద్ధము సస్యవృద్ధి యివిగలుగును

శ్లో. ఉదయాస్తమయేకాలే భృగుజేశ్వినిసంయుతే,
ప్రజానామాయురారోగ్యం భవేత్సస్యసమృద్ధయః ౨౦౬

తా॥ శుక్రుడశ్వినితోగూడి యుదయాస్తమయములైన ప్రజలకుసుఖము సస్యములకు వృద్ధి యివిగలుగును

శ్లో॥ ఉదగృక్షేరవిర్యాతే యామ్యర్క్షేభార్గవేసతి,
వృష్టిర్నాశనమాయాతి విపరీతేసువృష్టికృత్. ౨౦౭

తా॥ మేరువుకు వుత్తరనక్షత్రములయందు సూర్యుడుండగ దక్షిణనక్షత్రములయందు శుక్రుడుదయించిన వృష్టిగలుగును వ్యత్యస్తములైతే నతివృష్టిగలుగును

శ్లో. భృగౌయామ్యేగ్నినక్షత్రే నక్షత్రేసంస్థితేరవేః,
యామ్యేమార్గేనవిచరం వర్షదశ్చభృగోసుతః ౨౦౮
ఆర్ద్రావిశాఖావాయవ్యతిష్యర్క్షేషుచసంస్థితః,
సువృష్టికృదుదగ్దేశ మార్గేచవిచరంతథా ౨౦౯

తా॥ భరణి కృత్తిక పుబ్బ యీనక్షత్రములయందు శుక్రుడుండి సూర్యునికి దక్షిణముగ నడిచినను ఆర్ద్ర, మఖ, విశాఖ, స్వాతి, పుష్యమి యీనక్షత్రములయందు శుక్రుడుండి సూర్యునికి యుత్తరముగనడిచినను వృష్టిగలుగును.

శ్లో॥ భార్గవేపితృవిశ్వర్క్షే వక్రగత్యాస్తగేతథా,
వృష్టినాశోభవేదాశు నృపాణామాహవస్తథా ౨౧౦

తా॥ శుక్రుడు మఖయుత్తరాషాఢయందుండి వక్రించినను అస్తమించినను వృష్టిలేకపోవును రాజులకు పరస్పరము కలహముగలుగును

శ్లో॥ ఉత్తరాత్రయపుష్యర్క్షే బుధేచోదయగేతథా,
తదావృష్టిర్భవేద్భూమౌ అన్యర్క్షేత్వతిబాధకః ౨౧౧

తా॥ ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి యీనక్షత్రములయందు

బుధుడుదయించిన చక్కగవర్షించును తక్కిన నక్షత్రములయందుదయించిన యీతి బాధలు గలుగును

శ్లో. ఆదిత్యాదితిశక్రేషు విశ్వచిత్రానురాధిషు,
విషునక్షత్రకేతిష్ఠే ద్భార్గవేవృష్టినాశనమ్. ౨౧౨

తా హస్త, పునర్వసు, జ్యేష్ఠ, ఉత్తరాషాఢ, రోహిణి, మూల, యీనక్షత్రములయందు శుక్రుడుండిన వృష్టిగలుగదు

శ్లో. స్వాతీత్రయేగురుస్థిత్వా భృగుశ్చమఘపంచకే,
శశినస్తుతయోర్యుక్తౌ జగద్భీతికరంజలమ్. ౨౧౩

తా.స్వాతి,విశాఖ,అనూరాధ ఈనక్షత్రములయందు గురువును మఖాపంచకమునందు శుక్రుడుండగ వీరిలోనెవరితోనైన చంద్రుడుగూడెనేని జగద్భీతి కలుగ వర్షించును

శ్లో. యుక్తశ్చేజ్జీవ్యనావృష్టిః తయోర్వక్రగతశ్శనిః,
భూమిజోవాతయోర్యుక్తౌ తృణాభావాత్పశుక్షయః ౨౧౪

తా పైజెప్పినగురుశుక్రులతో బుధుడుగూడెనేని స్వల్పవృష్టిగలుగును శనిగాని కుజుడుగానివక్రించి పైగురుశుక్రులతోగూడిన భూమియందుగడ్డిలేక పశ్వాదులునశించును.

శ్లో. వక్రార్కిభార్గవాశ్చైక రాశిస్థాశ్చభవేద్యది,
మేఘబృందంతదానాశం గురుయుక్తేర్వర్షణమ్. ౨౧౫

తా కుజశనిశుక్రు లేకరాశిగతులైయుండిరేని మేఘములు నశించును. వారితో గురువుకూడియుండిన వర్షవర్షము గలుగును

శ్లో. రోహిణీమధ్యభాగేతు గురుర్వక్రగతోయది,
అనావృష్టిర్వాయుభేతు వక్రయుక్తేసువృష్టిదః. ౨౧౬

తా. గురువువక్రించి రోహిణిమధ్యాంశమందుండిన వర్షించదు స్వాతిత్రయమందు వక్రించిన మంచివృష్టిగలుగును

శ్లో. యదాశుక్రస్యపురతో భానుజోయదిగచ్ఛతి,
రవేఃపశ్చాద్భూమిసుతో నీహారమనువర్షతి. ౨౧౭

తా. శుక్రునికిముందు శని నడిచినను సూర్యునికివెనక కుజుడునడిచినను తుంపురులుగ వర్షించును.

శ్లో బుజుర్వక్రగతిర్యత్ర క్రమాద్భూమిజభానుజౌ,
గగనేజలదాభావాత్ మాసమేకంసవర్షతి ౨౧౮

తా. కుజుడు బుజుగతిగను, శనివక్రగతిగనునుండిన నాకసమునందు మేఘములు గానంబడక నొకమాసమువరకు వర్షించదు

శ్లో అష్టమ్యాంత్వష్ట్రనక్షత్రే నవమ్యాంవాతభేశకా,
విద్యుత్సమేఘంచ్ఛన్నేన బుధోదాశ్వీజమాసకే ౨౧౯

తా మార్గశిర బహుళ దివసంబున చిత్తయైనా నవమిదివసంబున స్వాతియైను ఘ లిగా

డినపుడు మెరుపుతో మేఘములుగానంబడిన రాబొయ్యేడి యాషాఢమాసములో చిత్త స్వాతులయం దతివృష్టిగలుగును

శ్లో. పౌషశుక్ల చతుర్థ్యాంతు విద్యుద్దర్శనముత్తమమ్,
మేఘచ్ఛన్నంనభస్సర్వం మధ్యేచేంద్రధనుస్తథా ౨౨౦
జలపాతంప్రయత్నేన హ్యహోరాత్రంనిరీక్ష్యతే,
పరివేషోగర్జితంవా బిందవఃపతితాస్తథా. ౨౨౧
సర్వేషామేవచిన్హానాం ప్రవర్షతినసంశయః,
విద్యున్మేఘధనుర్మధ్యే యద్యేకంవానదృశ్యతే. ౨౨౨
నతత్రవర్షతేకాలే సస్యవృద్ధిర్నజాయతే.

తా పుష్యశుద్ధచవితినాడు మెరుపులుగనుపడుట మేఘములాకసమున వ్యాపించియుండుట. ఇంద్రధనుస్సు గనపట్టుట అహోరాత్రములయందు జలబిందువులు భూపతనంబగుట, పరివేషము గనపట్టుట, గర్జించి వర్షబిందులు భూమియందు బడుట, ఈలక్షణంబులన్నియు గానంబడిన వర్షాకాలమునందు విశేషముగవర్షించును పైజెప్పిన శుద్ధచవితి నాడీలక్షణములలో నేదియును కొరబడియుండెనేని వర్షములేకనే పోవును సస్యములు ఫలించవు

శ్లో. ఏకాదశ్యాం తథాజ్ఞేయః సహిమంవిద్యుదీక్షణమ్,
సజలారోహిణీయోగో రవేర్విద్యాద్విచక్షణః. ౨౨౩

తా. పుష్యశుద్ధ ఏకాదశిదివసంబున మేఘములుకమ్మి సూర్యుడు రోహిణిలో నుండిన మంచివృష్టిగలుగును

శ్లో. పౌర్ణమాస్యాంద్వితీయాయాం తుహినంనహిచంచలమ్,
కాలేనిష్పత్తయోరావాశ్చ మేఘచ్ఛన్నంనదృశ్యతే. ౨౨౪
ఆషాఢేతుత్వమావాస్యా ప్రభూతంజలమాదిశేత్,

తా పుష్యశుద్ధపూర్ణిమ ఆ బహుళద్వితీయా యీరెండుదినములయందు విశేషముగ మంచుగలిగి యాకసమంగు మేఘములుగనపట్టవేని రాబొయ్యేడియాషాఢమాస యమావాస్యయందు విశేషముగ వర్షించును.

శ్లో. మాఘస్యశుక్లసప్తమ్యాం సవధానోప్యహర్నిశమ్. ౨౨౫
అహోరాత్రంనభోవాపి వారుణేవిద్యుదీక్షణమ్,
చండవాతోవరాభేద్యాం కర్తవ్యంచదివాపివా,
ప్రవర్షణంప్రభావేన యదితస్మిన్భవిష్యతి. ౨౨౬

తా మాఘశుద్ధసప్తమినా డహోరాత్రమాకసంబున మేఘములు వ్యాపించియుండినను పశ్చిమమునం దహోరాత్రములు మెరుపుగానంబడినను విశేషముగ గాలిగలిగినను రాబొయ్యేడిసంవత్సరంబున చక్కగవృష్టిగలుగును

శ్లో. మాఘేపంచదశీంజ్ఞేయ ప్రవిభజ్యచతుష్టయమ్,

ఆషాఢే ప్రథమే పాదే ద్వితీయే శ్రావణే తథా. ౨౨౭
తృతీయే భాద్రపదే చైవ చతుర్థాశ్వయుజే తథా,
అభ్రచ్ఛన్నం నభస్సర్వం జలపాతంచ విద్యతే. ౨౨౮
దుర్భిక్షంచ సుభిక్షంచ శలభశ్శుకస్తథా.

తా॥ మాఘపూర్ణిమ దివసంబును నాలుగుభాగములుగ జేసి మొదటిపాదము ఆషాఢము, రెండవ పాదము శ్రావణము, మూడవపాదము భాద్రపదము, నాలవపాదము ఆశ్వయుజము అని తెలిసికొనవలయును పైపూర్ణిమ దివసంబున నాలుగుభాగములయందు వర్ష ధాతువులుగలిగి జలబిందువులు భూపతనమైన దేశము సుభిక్షముగనుండును మొదటిభాగమునందా ధాతువులు లేకపోయిన నాషాఢమునందు దుర్భిక్షము, రెండవభాగమునందు లేకపోయిన శ్రావణమాసమునందు సుభిక్షము, మూడవభాగమునందు లేకపోయిన భాద్రపదమునందు మిడతలభయము, నాలవభాగమునందు లేకపోయిన నాశ్వయుజమున చిలుకలభయము ఈబాధలు సంభవించును

శ్లో॥ చిత్రాస్వాతీవిశాఖాసు శ్రావణేచ ప్రవర్షతి,
సర్వధాన్యాని విక్రీయ్య కర్తవ్యో ధనసంగ్రహః. ౨౨౯

తా॥ శ్రావణమాసములో చిత్తస్వాతివిశాఖ యీనక్షత్రములయందు వర్షించిన సర్వధాన్యములు బాగుగఫలించుటచే ధరలుతగ్గును గావున పాతధాన్యములను విక్రయించి ధనసంగ్రహము జేసికొనవలయును.

శ్లో॥ కవిజ్ఞబౌమాః కలితా ఏకరాశిస్థితాయది,
దుర్భిక్షయోగం సంప్రాహుః సముద్రమపిశోషియేత్ ౨౩౦

తా॥ శుక్రబృహస్పత్యంగరకు లేకరాశిలోగూడియుండి రేని వది దుర్భిక్షయోగమనంబడును నాయోగంబున సముద్రముసగా శోషించును

శ్లో॥ వృశ్చికేవృషభేసింహే మీనేధనుషివక్రగే,
భూమిజోరవిజోవాపి తిష్ఠేద్వృష్టివినాశనమ్. ౨౩౧

తా. వృశ్చికవృషభసింహమీన ధనూరాశులయందు కుజుడుగాని శనిగాని వక్రించియుండిన వృష్టిలేక దుర్భిక్షముగలుగును

శ్లో॥ వృషభేచఘటేచాపే మధ్యద్రేక్కాణగేశనౌ,
దుర్భిక్షేణమ్మృతం సర్వం సంభవేత్ప్రళయోపమమ్ ౨౩౨

తా॥ వృషభకుంభధనుస్సులయొక్క మధ్యద్రేక్కాణమునందు శనియుండినను దుర్భిక్షముచే మానుషపశుపక్షి మృగాదులన్నియు మరణమునుజెంది జగత్ప్రళయము సంభవించును

శ్లో॥ శుక్రేందూహ్యేకరాశౌవా హ్యేకాంశేవాయదాస్థితౌ,
నృపాణామాహావం విద్యాత్ తథవావృష్టికృద్భవేత్. ౨౩౩

తా. శుక్రచంద్రు లేకరాశిలోగాని యేకాంశమునందుగాని యుండిరేనిరాజులకు పరస్పరక లహముగాని విశేషవర్ష ముగాని కలుగును

శ్లో. భార్గవఃపురతోగచ్ఛే తన్మార్గంభౌమభౌనుజౌ,
అన్వయాతాంతదావృష్టీ ర్భూమిలోకేభయంకరా ౨౩౪

తా ముందుగశుక్రుడు ఆశుక్రునికి వెనుక కుజశనులు నడిచిరేని భూలోకమునందు భయంకరమగు వృష్టికలుగును.

శ్లో. చిత్రాస్వాతీవిశాఖాసు శ్రావణేనప్రవర్షతి,
సర్వరత్నానిసంత్యజ్య కర్తవ్యోధాన్యసంగ్రహః ౨౩౫

తా శ్రావణమాసములో చిత్తస్వాతి విశాఖనక్షత్రములయందు వర్షించకపోయె నేని దుర్భిక్షముచే ధాన్యముఫలించదు కావున రత్నాదులను విక్రయించి ధాన్యసంగ్రహము చేయవలయును

శ్లో. శుక్రాత్సప్తమేచంద్రేగతే సువృష్టిర్జాయతేజలాయేషుచ సూర్యజేత
ధాక వేఃపురస్సాన్యగతౌత దంతరేతదామహానం బుదనాశహేతుః.

తా. శుక్రునికి యేడవస్థానమునందు చంద్రుడుండినను ఆశుక్రునికి యేడునాలుగు పదవకొండు యీస్థానములయందు శనియుండినను మంచివృష్టికలుగును శుక్రునికి ముందు బుధుడుండిన మేఘములునశించి వర్షములేకపోవును

శ్లో. యదాచభార్గవోవక్రః ఇందుజోఋజుమార్గగః,
అతివృష్టిర్భవేత్తత్ర కేదారాస్సాగరోపమాః ౨౩౬

తా. శుక్రుడువక్రముగను బుధుడుఋజుమార్గముగను సంచరించిరేని యతివృష్టి గలిగి పంటభూములన్నియు సముద్రమువలె జలపూర్ణములుగ నుండును

శ్లో. ఉదగృక్షేరవిర్యాతే యామ్యర్క్షేభార్గవేసతి,
వృష్టిర్నాశమవాప్నోతి విపరీతేతివృష్టికృత్ ౨౩౭

తా ఉత్తరదిశనక్షత్రములలో సూర్యుడును దక్షిణదిశ నక్షత్రములలో శుక్రుడునుఉండిన వృష్టియేలేకపోవును అటులలేక దక్షిణదిశనక్షత్రములలో సూర్యుడును, ఉత్తరదిశనక్షత్రములలో శుక్రుడునుఉండిన నతివృష్టికలుగును.

శ్లో సింధుర్గిరిఃకుక్షితరం తీరంకుక్షిశ్చపర్వతాః,
భూధరేషుత్వనావృష్టి రతివృష్టిస్తుకుక్షిభే. ౨౩౮
తీరేతుచిత్రవృష్టిస్స్యా దతివృష్టిస్సముద్రభే

తా సముద్రనక్షత్రములు, పర్వతనక్షత్రములు, కుక్షినక్షత్రములు, తీరనక్షత్రములు ఇటుల నక్షత్రములునాలుగు విధములుగనుండును వాటిలో పర్వతనక్షత్రములయందనావృష్టి, కుక్షినక్షత్రములయం దతివృష్టి, తీరనక్షత్రములయందు చిత్రవృష్టి,సముద్రనక్షత్రములయందు మహావృష్టి ఇటులకలుగును.

శ్లో. బుధశుక్రౌసమీపస్థౌ యదాస్యాతాంతదాభువి,
దుర్జనాయత్రతిష్ఠంతి తత్రవృష్టిర్నజాయతే ౨౪౧

తా॥ బుధశుక్రులు సమీపముగ వర్తించునపుడుకూడ దుర్జనులుండుస్థలమందు వర్షించదు

శ్లో. ఏకోవక్రస్థథాబుజ్ఞో భార్గవశ్శశినందనః,
కేదారాశ్చతటాకాశ్చ భిందంతివసుధాతలే. ౨౪౨

తా॥ శుక్రునికి వక్రగతి, బుధునికి ఋజుగతి గలిగియుండునపుడు వరిమళ్లు చెరువులు ఇవి తెగిపోవునట్లు వర్షించును.

శ్లో. పురోంగారోహ్యనావృష్టిః పురశ్శుక్రఃప్రవర్షతి,
పురస్సౌమ్య స్తవేనావృష్టిః పురశ్చంద్రప్రవర్షతి. ౨౪౩

తా॥ సూర్యచంద్రబుధ శుక్రులకుముందుగ నంగారకుడునడిచిన వర్షించదు. శుక్రుడునడిచిన వర్షించును బుధుడునడిచిన అనావృష్టి చంద్రుడునడిచిన వర్షించును.

శ్లో. అతిచారగతేజీవే వక్రస్థేపిశనైశ్చరే,
హాహాకారంజగత్సర్వం దుర్భిక్షంచైవభూతలే. ౨౪౪

తా॥ గురువు అతిచారగతుడుగను, శని వక్రగతుడుగనునుండునపుడు భూమియందు దుర్భిక్షమువాటిల్లి ప్రజలకాహాకారము సంభవించును

శ్లో. గురౌసితేచజామిత్రే జామిత్రేర్కాద్గ్రహోయది,
జామిత్రేచగురౌయత్ర హ్యనావృష్టిర్భవేత్తదా. ౨౪౫

తా. గురువునకేడవస్థానమునందు శుక్రుడును శుక్రుని కేడవస్థానమునందు గురువును సూర్యుని కేడవస్థానమునందు గురువును గురువు కేడవస్థానమునందు సూర్యుడును ఉండునపుడు అనావృష్టిగలుగును

శ్లో. జలరాశిగతేచంద్రే జామిత్రే నవపంచమే,
అర్కసూనుఃకుజశ్చైవ కుర్యాదేకార్ణవంమహీమ్. ౨౪౬

తా॥ జలరాశియందు చంద్రుడుండునపుడు నాచంద్రునికి ౫-౭-౯ ఈస్థానములయందు శనికుజులుండిరేని విశేషముగ వర్షించును

శ్లో. జలరాశౌచసంస్థేషు శుక్రభౌమబుధేందుషు,
అతివృష్టిశ్చలోకానా మిత్యేవంమనురబ్రవీత్ ౨౪౭

తా॥ శుక్రకుజబుధచంద్రులు జలరాశిగతులుగనుండునపుడు లోకమునందతివృష్టివాటిల్లునని మనువు వచించెను

శ్లో. ఏకస్మిన్వత్సరేజీవే రాశిత్రయముపాగతే,
తదావసుంధరాకీర్ణా కుణపైసప్తకోటిభిః ౨౪౮

తా॥ ఒక సంవత్సరములోపల గురువు మూడురాసులయందు సంచరించెనేని యేడుకోట్లశవములచే భూమి నిబిడీకృతంబై యుండును

శ్లో. కృత్తికాచధనిష్ఠాచ మఖామైత్రంసముద్రగాః,
రోహిణీశతభిషజ్జ్యేష్ఠ ఫల్గునీపర్వతాఃస్మృతాః ౨౮౯
ఆశ్లేషాశ్రవణంచైవ ఇంద్రాగ్నీభరణీగిరిః,
ఉత్తరామృగశిరాపశ్చ ఆసురంపూర్వభాద్రికా. ౨౯౦
పుష్యంచవాయునక్షత్రం అశ్వినీకుక్షితారకాః,
శైవంహస్తం పౌష్ణచిత్ర పునర్వసుజలంతథా ౨౯౧
అశ్వశ్చాప్యుత్తరాభాద్రా తీరఋక్షాఃప్రకీర్తితాః,

తా. కృత్తిక, ధనిష్ఠ, మఖ అనూరాధ ఇవి సముద్రనక్షత్రములు రోహిణి శతభిషము, జ్యేష్ఠ, పుబ్బ, ఆశ్లేష, విశాఖ, భరణి. ఇవి పర్వతనక్షత్రములు, ఉత్తర, మృగశిర, మూల, పూర్వాభాద్ర, పుష్యమి, స్వాతి, అశ్విని, అభిజిత్, ఇవి కుక్షినక్షత్రములు, ఆరుద్ర, హస్త, రేవతి, చిత్త, పునర్వసు, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర, ఇవి తీరనక్షత్రములు అని తెలిసికొనవలయును

శ్లో. పూర్వేస్వాతీత్రయేచైవ పశ్చిమేమఘపంచకే ౨౯౨
భృగుఃకరోత్యనావృష్టిం విపరీతేప్రవర్షణమ్,

తా. శుక్రుడు, తూర్పుదిక్కున స్వాతివిశాఖ అనురాధ ఈనక్షత్రములలోను, పశ్చిమమున మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త యీనక్షత్రములలోను యుండునపుడు వర్షించదు అయితే నాశుక్రుడు తూర్పున మఖాపంచక నక్షత్రములలోను పశ్చిమమున స్వాతీత్రయనక్షత్రములలోను ఉండిన వర్షించును.

శ్లో. సమీరత్రయవారుణ్యాం ప్రాక్సంస్థేపితృపంచకే ౨౯౩
వక్రితేచేదనావృష్టి శ్శుక్రేరాస్తిపరాజయః,

తా. పశ్చిమమున స్వాతిత్రయమందును తూర్పున మఖాపంచకమునందును శుక్రుడు వక్రించియుండినపుడు దుర్భలముగలవాడు గాన వృష్టిగలుగదు

శ్లో. యామ్యేసార్పవిశాఖాచ త్రిపూర్వేషుచభూమిజః, ౨౯౪
కరోతిమహతీంవృష్టిం వారిపూర్ణావసుంధరా,

తా. భరణి, ఆశ్లేష, విశాఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీనక్షత్రములయందంగారకుడుండిన విశేషముగ వర్షించి భూమియంతయు జలపూర్ణంబగును

శ్లో స్వాతీపిత్రైంద్రరౌద్రాహి ప్రాజాపత్యోత్తరాసుచ. ౨౯౫
సంచరేజలదాన్హంతి భౌమసంవర్తకానపి,

తా. స్వాతి, మఖ, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర యీనక్షత్రములయందంగారకుడు సంచరించునపుడు సంవర్తకాది మేఘములుకూడ నశించి వృష్టిలేకపోవును.

శ్లో. హస్తాదిషట్సుతారాసు విచరంనిందునందనః. ౨౫౬
క్షేమంసుభిక్షమారోగ్యం కురుతేపశునాశనమ్,

తా హస్త మొదలాఱునక్షత్రములయందు బుధుడుసంచరించునపుడు క్షేమము సుభిక్షము ఆరోగ్యము ఇవిగలుగును పశునాశము సంభవించును.

శ్లో. సింహేభిన్నేకృతోవృష్టి రభిన్నేకర్కటేకుతః. ౨౫౭
కన్యాభిన్నేశరావృష్టి తులాభిన్నేసువృష్టికృత్,

తా సింహముభిన్నంబైన వర్షించదు కర్కటకము భిన్నముకాదేని వర్షించదు కన్యభిన్నమైతే నతివర్షము కురుసును తులభిన్నమైతే సువృష్టియగును.

శ్లో. జ్యేష్ఠమాసేసితేపక్షే ఆర్ద్రాదిదశఋక్షకే ౧౫౮
సజలానిర్జలామేఘాః నిర్జలాస్సజలాస్మృతాః,

తా జ్యేష్ఠశుక్లపక్షములో నార్ద్ర మొదలగు పదినక్షత్రములు భిన్నంబైన పదికార్తెలు వరపగును అటులభిన్నముకావేని చక్కగ వర్షించును

శ్లో. మృగేవృష్టిర్మఖేగర్జా స్వాత్యాంసౌదామినీయది. ౨౫౯
పంచాహంపంచఋక్షాణి ప్రతిఋక్షంచవర్షతి,

తా మృగశిరయందు వర్షము, మఖయందు ఉరుము,స్వాతియందు మెఱుపు ఇవి గలిగినట్టయిన కార్తెలన్నియు వర్షించును

శ్లో చిత్తాస్వాతివిశాఖాసు శ్రావణేనతువర్షతి ౨౬౦
సర్వరత్నానిసంత్యజ్య సర్వధాన్యస్యసంగ్రహః.

తా శ్రావణమాసమునందు చిత్తి స్వాతివిశాఖలలో వర్షించదేని సర్వరత్నములను త్యజించి సర్వధాన్యములనుకొని దాచవలెను

గాలివాన, వర్షము వీటిలక్షణము.

శ్లో. యదిభవతివిశాఖే స్వాతినక్షత్రయుక్తే
రవికుజగురువారే కార్తికేక్షీణచంద్రే. ౨౬౧
వియతిచఘనవృష్టి ర్వాయునావారిణావా
నరపశుమృగజాలం ఖేచరత్వంపహాంతి,

తా కార్తిక బహుళ యమావాస్యదివసంబున విశాఖలేక స్వాతినక్షత్రము, భాను కుజ గురువారములలో నొకవారముకూడిన గాలితోగూడ విశేషముగ వర్షించును మానుషపశుపక్షిమృగాదులు గాలివర్షముచే పీడింపబడి నశించిపోవును

శ్లో. యదిభవతివిశాఖే స్వాతియుక్తేథవాస్యాత్. ౨౬౨
శనిరవికుజవారే జ్ఞేగ్నితోర్జస్యదర్శే,
తరుగిరిగజయూథా వాయునాఖేచరాస్తే. ౨౬౩

జలమయభువిభాగే సింధుతుల్యోభవేచ్ఛ,

తా కార్తిక బ 30 దివసంబున స్వాతిలేక విశాఖనక్షత్రముగాని రవికుజబుధ గురుశనివారములలో నేదైనా నొకవారముగాని గూడిన గొప్పగాలితో విశేషముగ వర్షించి వృక్షములు విరిగిపడును పర్వతములు కదులును, ఏనుగలు గాలికి తూలిపడును మానుష పశుపక్షిజాలములన్నియు ఆకసమున కెగిరిపోవును

శ్లో. కార్తిక్యాంచసినీవాల్యాం విశాఖేభానువాసరే. ౨౬౪
అతిగండేపిసంయుక్తే మహావాయుఃప్రవర్తణమ్,

తా కార్తిక బ 30 దివసంబున విశాఖనక్షత్రము ఆదివారము అతిగండము. ఇట్టి యోగములుకూడిన ప్రళయవాయుసహితముగ వర్షించిన మానుషపశుపక్షి మృగాదులు మరణము జెందును

శ్లో. పురుషఃపురుషోవాయుః మహావాయుర్నపుంసకౌ. ౨౬౫
స్త్రీపుమాంసౌభవేద్వృష్టిః స్త్రీస్త్రీశీతంతుకథ్యతే.

తా. ఇరువురు పురుషగ్రహములుకూడిన వాయువు, ఇరువురు నపుంసకగ్రహములు కూడిన మహావాయువు, పురుషగ్రహము, స్త్రీగ్రహము, ఈ రెండునుగూడిన వర్షము, ఇరువురు స్త్రీగ్రహములుకూడిన శీతము ఇటులగలుగును.

శ్లో అత్యుష్ణమతిశీతంచా ప్యాకాశమతినిర్మలమ్. ౨౬౬
మందవాయుర్మహావాయుః సువృష్టికథ్యతేబుధైః,

తా మిగులయుష్ణము, మిగులశీతము, ఇటులనుండుటయు, ఆకాశము నిర్మలముగనుండుటయు, కొద్దిగాలివీచుటయు, లేక విశేషముగ గాలివీచుటయు, ఇట్టిచిన్నములు గలిగియుండిన చక్కగ వర్షించును

శ్లో. సంవాతివాయుర్యదిచోష్ణశీతే మందూకరావేశిశిరేవసంతే. ౨౬౭
మయూరపింఛేశశిసూర్యమండలేదినత్రయేవారిపతంతుభూవకా,

తా అల్పముగగాలివీచుట, అతియుష్ణము, అతిశీతముగనుండుట, మాఖఫాల్గుణచైత్రవైశాఖమాసములలో గప్పలరుచుట, చంద్రసూర్య మండలములలో నెమలిఫింఛచ్ఛాయగానంబడుట, ఇట్టిలక్షణములు గన్పట్టైనేని భూమియందు మూడుదినములు వర్షించును

శ్లో. ఆషాఢేశ్రావణేజ్యేష్ఠే పూషాద్యాసప్తతారకే. ౨౬౮
పశ్చాదింద్రధనుఃదృష్ట్వా దుర్భిక్షంవృష్టినాశనమ్,

తా. జ్యేష్టాషాఢశ్రావణమాసములలో పుష్యమి మొదలేడునక్షత్రములవరకు పశ్చిమమున నింద్రధనుస్సుగానంబడిన దుర్భిక్షముగలుగును వృష్టిగలుగదు

శ్లో. ఆషాఢేశ్రావణేజ్యేష్ఠే శుక్లపక్షేపి దృశ్యతే. ౨౬౯
పశ్చిమేచేంద్రచాపంచ సుభిక్షంసుఫలంభవేత్,

తా. జ్యేష్ఠాషాఢశ్రావణమాసములలో శుక్లపక్షమందు పశ్చిమమున ఇంద్రధనుస్సు గానంబడిన సుభిక్షము సస్యఫలితముగలుగును

శ్లో. రేవతీతోయనాశాయ సస్యనాశాయచాశ్విని ౧౭౦
భరణీధాన్యనాశాయ నవర్షేశస్యకృత్తికా,

తా. రేవతిలోవర్షించిన భూమిమీద నీళ్లులేకపోవును. అశ్వినిలోవర్షించిన సస్యములురెండిపోవును భరణిలోవర్షించిన ధాన్యముప్రియమగును కృత్తికలో వర్షించక పోయిన ధాన్యపుధరలు హెచ్చును

సూర్యచంద్రాదిగ్రహముల పరివేషములు.

శ్లో. ఇనశశిపరివేషం పూర్వయామేచపీడా
ఇనశశిపరివేషం మధ్యయామేసువృష్టిః ౧౭౧
ఇనశశిపరివేషం త్రీణియామేసుభిక్షమ్,
ఇనశశిపరివేషం చాస్తమానేసువృష్టిః. ౧౭౨
గురుశశిపరివేషం బ్రాహ్మణానాంచపీడా,
కలహమవనిపుత్రే సూర్యజేవృష్టిపాతః, ౧౭౩
బుధశశిపరివేషం స్త్రీజనానాం వినాశో,
భృగశశిపరివేషం సర్వనాశంకరోతి ౧౭౪

తా సూర్యచంద్రులకు ప్రధమయామములో పరివేషములుగలిగిన లోకమునకు పీడయు, ద్వితీయయామములోగలిగిన వృష్టియు, తృతీయయామములో గలిగిన సుభిక్షము, చతుర్థయామములోగలిగిన సువృష్టియు,ఇటులగలుగును మరియు గురుచంద్రులకు పరివేషములుగలిగిన బ్రాహ్మణులకుపీడయు, చంద్రకుజులకు గలిగినకలహము, చంద్రబుధులకుగలిగిన స్త్రీలకునాశము, చంద్రశుక్రులకుగలిగిన సమస్తమున్ను నశించును.

శ్లో. రవిశశిపరివేషం రాష్ట్రనాశంవసంతే,
భవతినృపతియుద్ధం గ్రీష్మగేనృష్టినాశమ్. ౧౭౫
జలధరశిశిరర్తౌ వారిపూర్ణాచసౌమ్యే,
కుజశనిశిఖిరాహు స్సంయుతేదీర్ఘరోగాః. ౧౭౬

తా చైత్రవైశాఖమాసములలో సూర్యచంద్రపరివేషములు గలిగినదే శక్షోభము రాజయుద్ధము జ్యేష్ఠాషాఢమాసములలో గానంబడిన వృష్టినాశము శ్రావణభాద్రపద ఆశ్వయుజకార్తికమాసములలో గానంబడిన సువృష్టిసస్యవృద్ధియును గలుగును. పైజెప్పిన మాసములలో బుధ,కుజ,శని,కేతు, రాహువులకు పరివేషములు గానంబడిన ప్రజలకనేక రోగములు గలుగును

శ్లో. పరివేషేచహేమంతే పశునాశోభవేద్ధ్రువమ్,
శిశిరోపగమేచైవ చోరాగ్నిజలజంభయమ్. ౧౭౭

తా. సూర్యచంద్రపరివేషములు మార్గశీర్ష పుష్యమాసములయందు గానంబడిన పశు
నాశము మాఘఫాల్గుణమాసములయందు గానంబడిన చోరాగ్నిభయము ఇవి గలుగును

శ్లో. ప్రాతఃకాలే ప్రజాపీడా సంగవేపశునాశనమ్,
పరివేషస్తుమధ్యాహ్నే అనర్ఘకలహాప్రదః ౨౭౮
సుభిక్షంచాపరాహ్ణేచ సాయాహ్నేసర్వనాశనమ్,
రక్తధూమ్రాసితేపీతే చార్ఘహీనంప్రజాభయమ్. ౨౭౯

తా సూర్యచంద్రపరివేషములు ప్రాతఃకాలంబున (అనగా నాలుగడియలకులో
గానంబడిన ప్రజలకు పీడ సంగమకాలము (అనగా పదిరెండు గడియలకులోపల)
గానంబడిన పశునాశము, మధ్యాహ్నమునందు గానంబడిన ధరలుహెచ్చుట యుద్ధము,
అపరాహ్ణమునందు గానంబడిన సుభిక్షము,సాయాహ్నమునందు గానంబడిన సకలసస్య
ములకు నాశము, ఎఱుపుపచ్చ తెలుపు ఇట్టిధూమ్రములయందు యుద్ధము ధర ప్రతులుహె
చ్చుట ఇవి గలుగును.

ఆర్ద్రాప్రవేశకాలఫలము

శ్లో. ఆర్ద్రాప్రవేశవేళాయాం భిన్నేవృష్టిదినేషుచ,
అనావృష్టింతథాకుర్యా ద్దివాభిన్నేనదోషభాక్. ౨౮౦

తా ఆర్ద్రాప్రవేశసమయంబున భిన్నించిన నఱువదిదినములు వృష్టిగలుగదు పగ
ం భిన్నించినట్లయిన పైదోషము లేకపోవును.

గ్రహకూటఫలము

శ్లో. రవిక్షేత్రేత్వనావృష్టిః చంద్రక్షేత్రేజలాగమః,
భౌమక్షేత్రేభవేద్యుద్ధం బౌధేచేద్వాయుపీడనమ్. ౨౮౧
ఆరోగ్యంచగురుక్షేత్రే శుక్రక్షేత్రేజలాగమమ్,
శనిక్షేత్రేవ్యాధిభయం గ్రహాణాంకూటజంఫలమ్. ౨౮౨
ద్వౌగ్రహౌచేజ్జనక్షోభః త్రయోఘ్నంతినరాధిపాన్,
చత్వారోరాష్ట్రనాశాయ హంతిపంచజగత్రయమ్. ౨౮౩
పంచగ్రహాణాంవినిహంతిభూపాన్
షష్ఠగ్రహాణాంచ సమస్తభూమౌ,
సప్తగ్రహాణాం వినిహంతిరాష్ట్రం
నిర్మర్త్యమష్టగ్రహరాశికూటమ్. ౨౮౪

తా రవిక్షేత్రమునందు గ్రహకూటముజేరిన ననావృష్టియు, చంద్రక్షేత్రమునందు
జేరిన సువృష్టియు, కుజక్షేత్రమునందుజేరిన యుద్ధము, బుధక్షేత్రమునందుజేరిన వాయుపీ
డ, గురుక్షేత్రమునందుజేరిన నారోగ్యము. శుక్రక్షేత్రమునందుజేరిన నతివృష్టియు, శని
క్షేత్రమునందుజేరిన వ్యాధిపీడయు, ఇవి గలుగును. మఱియు రెండుగ్రహము లొకరాశి

లోజేరిన జనక్షోభము, మూడుగ్రహములుజేరిన రాజులకుభీతి, నాలుగుగ్రహములుజేరిన రాజ్యనాశము, ఐదుగ్రహములుజేరిన త్రిలోకమునందుపీడ, ఆరుగ్రహములుజేరిన సకల రాజ్యనాశము, ఏడుగ్రహములుజేరిన సకలభూమండలమునకు నాశము, ఎనిమిదిగ్రహము లుజేరిన భూమియందు జనసంచారమేలేకపోవుట, ఇవిగలుగును.

జన్మరాశ్యాదులయందు గ్రహకూటఫలము.

శ్లో॥ ఏకేనైవాపమృత్యుస్స్యా ద్వితీయేధననాశనమ్,
తృతీయేశ్రియమాప్నోతి చతుర్థేధననాశనమ్ ౧౮౩
పంచమేచాత్మనాశాయ షష్ఠేశత్రుక్షయంభవేత్,
భాగ్యహానిస్సప్తమస్థే మృత్యుమాప్నోతిచాష్టమే ౧౮౪
నవమేధర్మహానిస్స్యా ద్దశమేకర్మనాశనమ్,
ఏకాదశేతులాభస్స్యా ద్ద్వాదశేమృత్యుమాప్నుయాత్. ౧౮౫

తా॥ జన్మలగ్న, జన్మరాశి, నామరాశి, వీటిలోనేనియందైనా గ్రహకూటముజేరిన నపమృత్యువు, దానికిరెండవరాశిలోజేరిన ధననాశము, మూడులోజేరిన సంపత్కరము, నాలుగులోజేరిన బంధునాశము, అయిదులోజేరిన ఆత్మనాశము, ఆరులోజేరిన శత్రునాశము, ఏడులోజేరిన భాగ్యనాశము, ఎనిమిదిలోజేరిన మరణము, తొమ్మిదిలోజేరిన ధర్మనాశము, పదిలోజేరిన కర్మనాశము, పదకొండులోజేరిన లాభము,పన్నెండులోజేరిన మృత్యువు ఇట్టుల జన్మాదిరాసులలో గ్రహకూటముగూడిన ఫలమును తెలిసికొనవలయును

శ్లో॥ అవయోగఫలంపూర్వం షణ్మాసాభ్యంతరేధ్రువమ్,
సుయోగస్యఫలంపశ్చాత్ మాసద్వయఫలంభవేత్. ౧౮౬

తా॥ అవయోగములయొక్క ఫలమారుమాసములకు ముందుగనే గనుపించును. సుయోగములయొక్కఫలము రెండుమాసములు గతించినపిదప గానంబడును

శ్లో॥ యత్రయత్రగ్రహాకూటో స్వధర్మపతిసంయుతః,
తత్త్రద్రాశీశ్వరయుతః నదోషోనాత్రసంశయః. ౧౮౭

తా॥ ఏయేరాశిలో గ్రహకూటము గలుగుచున్నదో నారాశ్యధిపతినవమాధిపతితో గూడియుండినను ఆరాశ్యధిపతి నాగ్రహకూటములో జేరియుండినను పైగనుపరచిన దోషములు సంభవించవు

శ్లో॥ యద్భావస్థేఖేటకూటోప రాగేతత్తత్సంఖ్యామాసమధ్యేహ్యనర్థః,
తన్మధ్యేచేద్ధోమదానాది కుర్యాదాయుర్వృద్ధిః పుత్రకామార్థసిద్ధిః.

తా॥ గ్రహకూటము గ్రహణము ఇవి పండ్రెండురాసులలో నేరాశియందు సంభవించునో ఆట్టిమాసములకు మధ్యనే కీడుగలుగును గాన నామాసములకు లోపలనే హోమదానాదులనుజేసిన నాయుర్వృద్ధి పుత్రపౌత్రధనధాన్యాది లాభముగలుగును.

శ్లో. గృహకూటోపరాగాశ్చ యత్కాలేసంభవంతిహి,
తత్కాలేజపహోమాది దానంకుర్యాద్యథావిధి. ॥ ౧

తా, ఎపుడుతనరాశిలో గ్రహకూటము లేక గ్రహణముసంభవింపుచున్నదో నపుడే జపహోమదానాదులను యథావిధిగ జేయవలయును.

వర్ష యోగములు.

శ్లో. చిత్రావిశాఖాతుహినాంశుభేషు,విశ్వంభరాయాస్తనయఃప్రయాతః
ధరాంసమస్తాముదకప్రమగ్నా, ముదగ్గతస్థూలతనుఃకరోతి. ॥ ౨

తా చిత్తవిశాఖమృగశిర యీనక్షత్రములయం దంగారకుడుండగ భూమండలముదకముచే నిబిడీకృతంబుగనుండును. పైనక్షత్రములయం దుదయించినను సుభిక్షము గలుగును

శ్లో. ప్రావృషీందుస్సితా త్సప్తరాశిగశ్శుభవీక్షితః,
మందస్త్రికోణసప్తస్థో యదివావృష్టికృద్భవేత్. ॥ ౩

తా. వర్షాకాలములో శుక్రునికేడవరాశియందు చంద్రుడుండి శుభగ్రహములచే జూడబడినను ఆశుక్రునికి ౫-౯ ఈరాసులలో శనియుండినను విశేషముగవర్షించును.

శ్లో. అమోఘాదక్షిణామేఘాః అమోఘాఃపూర్వవాయవః,
అమోఘాచోత్తరావిద్యు దమోఘంపశ్చిమంధనుః ॥ ౪

తా. పర్వతములవలె దక్షిణదిక్కున మేఘములుండినను, తూర్పుగాలి వీచినను, ఉత్తరమున మెఱుపుగానంబడినను పశ్చిమమున నింద్రధనుస్సు గనుపించినను విశేష వృష్టి గలుగును

శ్లో, గురావస్తంగతేవృష్టిః వృష్టిస్యాద్భార్గవోదయే,
చలత్యంగారకేవృష్టిః త్రివిధేపిశనైశ్చరే. ॥ ౫
ఇందోశ్చపంచసప్తస్థః మందోవాభూమినందనః,
సువృష్టిర్వాయువృష్టిర్వా భూలోకేచాతిభీకరా. ॥ ౬

తా గురువు అస్తమించునపుడును శుక్రుడుదయించునపుడును అంగారకుడు చలించునపుడును మంచివృష్టిగలుగును మఱియు శనియొక్కయుదయాస్తమయ చలనములయందు సువృష్టిగలుగును. మఱియు చంద్రునికి ౫-౭ రాసులలోగాని లేక యంగారకుడుగాని యుండునపుడును విశేషగాలితోగూడ భయంకరమగు వృష్టిగలుగును.

శ్లో మఖార్ద్రాచోత్తరాసార్ప స్వాతీజ్యేష్ఠాచరోహిణీ,
యత్రస్థానేస్థితోభౌమః తత్కాలేచనవర్షతి. ॥ ౭
బుధశుక్రసమీపస్థః కుర్యాదేకార్ణవంజగత్,
తావుభౌరవిమధ్యస్థౌ సముద్రోపిచశుష్యతి. ॥ ౮

తా. మఖా, ఆర్ద్రా, ఉత్తరా, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ఆశ్లేష, స్వాతి, విశాఖా, జ్యేష్ఠా, రోహిణి ఈనక్షత్రములయందంగారకుడుండునపుడు వర్షమేలేకపో వును బుధుడు శుక్రసమీపమునందుండిన భూమియేకార్ణవముగునట్లు వర్షించును నారి మపురిమధ్యను రవియుండిన వర్షములేక సముద్రముకూడ శోషించును

శ్లో. ఆర్ద్రాప్రవేశే యదిభాస్కరస్య
కేంద్రత్రికోణే గురుచంద్రయోశ్చ,
జలాగమస్థే భృగువీక్షితేవా
సంపూర్ణమేఘా స్సుముఖాభవంతి. ౨౯౯

తా సూర్యుడార్ద్రాప్రవేశకాలమునందు సూర్యునికి ౪-౫ ౭ ౯-౧౦ ఈరాసులలో గురుచంద్రులుండి శుక్రునిచే జూడబడిన నాసంవత్సరమున మంచి మేఘములువ్యా పించి చక్కగవర్షించును.

శ్లో. గౌతమ్యాదక్షిణేదేశే కావేర్యాశ్చోత్తరేతథే,
మహావృష్టిజలంఘోరం శనిచంద్ర భృగుస్థితౌ. ౩౦౦

తా శనిచంద్రశుక్రులేకరాశిగతులుగనుండిన గౌతమీనదికి దక్షిణము కావేరికి ఉత్తరము ఈమధ్యదేశమునందు విశేషముగవర్షించును

శ్లో. దస్రాదిద్వితయస్థేర్కే యదివృష్టిర్భవేత్తదా,
క్షేమంసుభిక్షమతుల మతిదోషోగ్నిధిష్ణ్యగే. ౩౦౧

తా అశ్వని భరణి యీనక్షత్రములయందు సూర్యుడుండునపుడు వర్షించిన లోకమునందు క్షేమఫలములుగలుగును. కృత్తికయందు సూర్యుడుండునపుడువర్షించిన యీతిబాధలు గలుగును

శ్లో. రోహిణీద్వితయస్థేర్కే సస్యవృద్ధిర్నిరామయః ౩౦౨

తా. రోహిణి మృగశిర యీనక్షత్రములయందు సూర్యుడుండునపుడు వర్షించిన సస్యారోగ్యాభివృద్ధిగలుగును

శ్లో. ప్రవేశకాలే యదిరౌద్రభస్య వృష్టిర్భవేద్భీతి రనర్ఘతాచ,
శేషేచపాదత్రితయేతుభీతి రత్యల్పవృష్టిర్మహతీరుజాచ ౩౦౩

తా. ఆర్ద్రాప్రవేశకాలంబున ప్రథమపాదములో వర్షించిన ప్రజలకుభీతి, ధరప్ర తులుహెచ్చుట అతివృష్టి ఇవిగలుగును తక్కిన మూడుపాదములయందు వర్షించిన నల్పవృష్టి ప్రజలకు రోగభీతి ఇటుల సంభవించును.

శ్లో. ఆర్ద్రాప్రవేశేవృష్టిస్స్యా త్సార్ధమాసాప్రవర్షణమ్,

తా. ఆర్ద్రాప్రవేశకాలంబున వర్షించిన నొకటిన్నరమాసము వృష్టిలేకపోవును.

శ్లో. ఆదిత్యాదిద్విదైవాంత దశర్క్షేషుస్థితేరవౌ,
సస్యవృద్ధిస్సుభిక్షంచ వినాసింహప్రవేశనమ్. ౩౦౮
మిత్రభాదిత్రయస్థేర్కే వ్యాధిరీతిభయంభవేత్,

తా. పునర్వసు మొదలు విశాఖపర్యంతము ౧౦ నక్షత్రములలో సూర్యుడుండునపుడు వర్షించిన సుభిక్షము సస్యవృద్ధి యివి గలుగును అనూరాధ మొదలు 3 నక్షత్రములయందు సూర్యుడుండునపుడు వర్షించిన ప్రజలకువ్యాధి యీతిబాధ యివిగల్గును.

శ్లో. జలాధిదైవర్క్షగతేపతంగే విద్యున్మరుద్వారిఘనైశ్చయుక్తే,
దేవేషునార్ధ్రత్రిదశేషుపశ్చాదార్ద్రాదిభేషు క్రమశస్సువృష్టిః.

తా. పూర్వాషాఢనక్షత్రమునందు సూర్యుడుండునపుడు మెఱుపు, గాలి, వర్షము, మేఘము యివి గలిగినట్టయిన దేశమునంగు ఆర్ద్రకార్తె మొదలు పదికార్తెలయందును మంచివృష్టిగలుగును

శ్లో. భంగస్సుపౌష్ణర్క్షదినేషుతస్మిన్ స్థితేషురాత్రావభివీక్షణీయమ్.

తా. రేవతికార్తెలో నహోరాత్రములయందు వర్షించిన నాసంవత్సరమునందు వర్షమేలేకపోవును.

శ్లో. విశ్వభాదిషడృక్షేషు సువృష్టిః క్షేమమేవచ,
రేవతీసంయుతేసూర్యే యదివృష్టిర్భవేత్తదా. ౩౦౯
అతంకోభువివృష్టిస్స్యా ద్దశర్క్షేషునవర్షణమ్,

తా. ఉత్తరాషాఢ మొదలు ఆఱునక్షత్రములయందు సూర్యుడుండగ వర్షించిన సువృష్టి క్షేమము యివి గలుగును రేవతియందు సూర్యుడుండునపుడు వర్షించిన నార్ద్ర మొదలు పదినక్షత్రములయందు యథాక్రమముగ వర్షించదు.

## వర్షధారారుచినిర్ణయ నక్షత్రములు.

శ్లో. అశ్వినీభరణీరాధా శుక్రభూమిజతారకాః. ౩౧౦
శివాదితికరత్వష్ట్రౌ ఉత్తరాబుధజారకాః,
అసురంజలపౌష్ణంచ ఉపాంశుగురుధిష్ణ్యకాః. ౩౧౧
విధుతారాగ్నివాయుశ్చ ఇంద్రాగ్నీ భృగుతారకాః,
మఖాపుబ్బానూర్యర్క్షాః పుష్యాశ్లేషావిధోస్తథా. ౩౧౦

ఉత్తరాషాఢవిష్ణుశ్చ శతతారావసుస్తథా,
అజైకపాదం బుతుంచ మంఽపబుతూః ప్రకీర్తితాః   ౩౧౧

తా. అశ్వని, ఽఽణీ, విశాఖా, జ్యేష్ఠ ఇవి అంగారక నక్షత్రములు. ఆర్ద్ర, పునర్వసు, హస్త, చిత్త, ఉత్తర ఇవి బుధనక్షత్రములు మూల, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి ఇవి గురునక్షత్రములు, మృగశిర, రోహిణి, కృత్తిక, స్వాతి, విశాఖా ఇవి శుక్రనక్షత్రములు, మఖ, పుబ్బ ఇవి సూర్యనక్షత్రములు, పుష్యమి, ఆశ్లేష ఇవి చంద్రనక్షత్రములు, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర ఇవి శనినక్షత్రములు, సూర్యనక్షత్రములలోవర్షించిన గోధుమలు జొన్నలు పండును, ఇటులనే యేయేగ్రహనక్షత్రములలో వర్షించునేని వారివారికిచెప్పిన ధాన్యములుఫలించును.

## ధూమకేతులక్షణము - దానిఫలము.

శ్లో. ఛత్రంధ్వజశ్శరోవీణా చామరంతోమరంఫణీ,
ప్రాగాదిపశ్చిమేయాంతి దక్షిణేచోత్తరేతథా.   ౩౧౨
ఊమడాంబరమాహుస్తు ధూమకేతో స్తథైవచ,
ఛత్రంధ్వజశ్శరోవీణా చామరంతోమరంఫణీ.   ౩౧౩
ధూమ్రారక్తాచకృష్ణాచ శ్వేతరక్తాచపాటలా,
సుభిక్షంశ్వేతరక్తాచ ధూమ్రేదుర్భిక్షమాప్నుయాత్   ౩౧౪
రక్తావృష్టివినాశాయ కృష్ణేయుద్ధంభవేన్మహత్,

తా. ధూమకేతు, ఛత్రము, ధ్వజము, బాణము, వీణ, చామరము, తోమరము, సర్పము, ఈయాకారముగ తూర్పు పశ్చిమ ఉత్తర దక్షిణములుగ నాకసమునందు కానంబడును. అదిగానంబడిన ఊమడాంబరములు దేశమునందు వ్యాపించును, పైధూమకేతువులయాకారము ధూమ్రము, ఎఱుపు, నలుపు, శ్వేత, రక్త, పసుపువర్ణము గలవిగనుండును. ఇట్టిధూమకేతువులలో శ్వేతరక్తవర్ణముగనుండిన సుభిక్షము, ధూమ్రవర్ణముగనుండిన దుర్భిక్షము. రక్తవర్ణముగనుండిన వృష్టిహాని,కృష్ణవర్ణముగనుండినయుద్ధభీతిఇవిగలుగును.

## శ్వేతకేతులక్షణము.

శ్లో. శ్వేతకేతోఃప్రవక్ష్యామి శుభాశుభవినిర్ణయమ్   ౩౧౫
పూర్వపశ్చిమభాగేతు సుభిక్షంచ సువృష్టికృత్,
దక్షిణేచోత్తరేచైవ పశుహానిర్నసంశయః.   ౩౧౬

వాయవ్యాగ్నేయకోణేషు రోగపీడా ప్రజాయతే,
ఈశాన్యే నైఋతేచైవ యుద్ధం భవతినిశ్చయమ్ 3౧

పుచ్ఛతారా భవేద్దృష్టం జ్యేష్ఠజంగమనాశనమ్,
అధోముఖంనృపంహంతి తిర్యక్పశునాశనమ్. 3౧

తా. శ్వేతకేతువు పూర్వపశ్చిమదిశలయందు గానంబడిన సుభిక్షము సువృష్టియు గలుగును, దక్షిణోత్తరదిశలయందు గానంబడిన పశునాశముగలుగును, వాయవ్యాగ్నేయదిశలయందు గానంబడిన రోగపీడగలుగును, ఈశాన్య నైఋతిదిశలయందు గానంబడిన యుద్ధముగలుగును, మఱియు తోకనక్షత్రముగానంబడిన గజములు మొదలగు పెద్ద జంతువులు నశించును, అది అధోముఖంబుగనుండిన రాజులకు హానిగలుగును, అడ్డముగ గానంబడిన పశువులకు నాశముగలుగును

పుష్పబంధమను వర్షాదిప్రదర్శిని,

సంపూర్ణము.



చంద్రికాప్రెస్సున ముద్రితము, చాకలపేట, చెన్నపురి:—1926.

# ంధ్ర గ్రంథములు.

## వచన గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ంధ్రవచనభాగవతము, ద్వాదశ స్కంధములు,ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము—— | | |
| ,, ఆదిసభాపర్వములు | 4 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 4 | 0 |
| , విరాటోద్యోగపర్వము | 4 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 5 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు | (అచ్చు) | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| ఆరేబియన్ నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారణ, ప్రహసనం | 0 | 4 |
| ...సీదాసురామాయణము | 12 | 0 |
| ...లకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, వచనం | అచ్చు | |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | ౬ | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 12 |
| పంచతంత్రము, వచనము | 0 | 12 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 8 |
| నీతిరత్నాకరము | 0 | 12 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| సంగ్రహభారతము | 1 | 8 |
| సంగ్రహభాగవతము | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | అచ్చు | |
| పతివ్రతలచరిత్రలు | 2 | 8 |
| దక్కనుపూర్వకథలు | 2 | 8 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 2 | 0 |
| దశకుమారచరిత్రము | 2 | 0 |
| మదనకామరాజుకథలు, | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రాజశేఖరుడు, గోపాలుడు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| వైద్యులకథలు | 0 | 4 |
| బేతాళునికథలు | 0 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | 0 | 3 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| రేచుక్కపగటిచుక్కకథ | 0 | 3 |
| సత్యసేనవిజయము | 0 | 6 |
| ఋషులచరిత్ర | 0 | 8 |
| పురాణగాథలు I | 0 | 12 |
| ,, II | 0 | 12 |
| బాజీరాయని చరిత్ర | అచ్చు | |
| రఘువంశకథ | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర | 1 | 0 |
| వివేకానందవిజయము | 2 | 8 |
| పరిహాస్యవినోదకథలు | 0 | 12 |
| ఈసబునీతికథలు, 1-వ భా॥ | 0 | 8 |
| డిటో 2-వ భా॥ | 0 | 12 |
| పంజాబుఅల్లరి | 0 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 |
| మర్యాదరామన్నకథలు | 0 | 3 |
| మైరావణచరిత్ర | 0 | 1 |
| షేక్స్పియర్ నాటకకథలు | అచ్చు | |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | 0 | 12 |
| ప్రహ్లాదచరిత్ర, ప్రతిమలతో | 0 | 6 |
| [illegible] ,, | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నల | ,, | 0 | 8 |
| సావిత్రి | ,, | 0 | 6 |
| హరిశ్చంద్ర | ,, | 0 | 8 |

### నవలలు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| సీతారామము | | 1 | 8 |
| ఐవన్హో, | నవల | 0 | 8 |
| మదాలస | ,, | (అచ్చు) | |
| సుజనరంజని | ,, | 0 | 8 |
| విజ్జలదేవి | ,, | 1 | 8 |
| ఉన్మాదిని, | నవల | 0 | 4 |
| రాధారాణి | ,, | 0 | 4 |
| అస్తమయము | ,, | 2 | 0 |
| దుర్గేశనందని | ,, | 0 | 12 |
| కపాలకుండల | ,, | 0 | 12 |
| లక్షణ | ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ,, | 1 | 8 |
| లీల | ,, | 0 | 6 |
| రాజర్షి | ,, | 1 | 8 |
| తారాబాయి | ,, | 1 | 0 |
| దిలారామ | ,, | 1 | 8 |
| కోవలన్ కన్నకి | | 0 | 12 |
| మనోహరి | ,, | 0 | 14 |
| వీరబాల | ,, | 0 | 8 |
| ఆనందమఠ | ,, | 1 | 0 |
| లాలాబాయి | ,, | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము | ,, | 1 | 8 |
| రోషినార | ,, | 0 | 12 |
| బాలాదిత్య | ,, | 3 | 0 |
| దేశభక్తుడు | | 1 | 8 |
| శంభుతోనొకనాటిసహవాసం | | 0 | 4 |
| చంద్రగుప్తుడు, నవల | | 2 | 8 |